**Approved by the Text-Book Committee**
**Fort St. George Gazette, 15th June 1915.**

# HARISHCHANDRA

## (TELUGU PROSE)

REVISED & ENLARGED

" Truth has always a fast bottom."
" Truth is the best buckler."
" Truth is the highest thing that man may keep."—*Chaucer.*
" Dare to be true, nothing can need a lie."—*Herbert.*



K. C. DESIKACHARLU,
RETIRED ASSISTANT, TONDAIMANDALAM,
T. V. SECONDARY SCHOOL, MADRAS.

THIRD EDITION.

Printed at the
Kesari Printing Works, Madras.

 1929 [PRICE As. 8.

విద్యాధికారులచే నంగీకరింపఁబడినది.

# హరిశ్చంద్ర.

తెనుఁగు వచనము.

(పునస్సంశోధితము, పరివర్ధితము.)

న. చ. దేశికాచార్యులచే

విరచితము.

" బ్రదుకువచ్చుఁగాక ♦ బహుబంధనములయిన
వచ్చుఁగాక లేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైనఁ ♦ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు ♦ మానధనులు"

" నాస్తి సత్యసమో ధర్మో నసత్యాద్విద్యతేపరం"
There is no virtue equal to truth
and there is none more excellent than that.
" నహి తీవ్రతరం కించి దనృతాదిహవిద్యతే:"—మహాభారతము.
There is no sin in the world greater than untruth—
*Mahabharata.*

(మూడవకూర్పు)

మద్రాస్
కేసరీ ముద్రాక్షరశాలా ముద్రితము.
**1929**

శ్రీ రస్తు.

# హరిశ్చంద్ర.

---

మదఖండభూమండల మండనాయమానంబగు భరతఖండంబున యమునాతీరంబున హస్తినాపురంబు గలదు. దాని కధిపతి కౌరవ్యుండగు ధృతరాష్ట్రుండు. ఆతనికి దుర్యోధనాదులగు నూఱుగురుపుత్త్రులును, రాజ్యతంత్రధూర్వహుండగు పాండురా జనుతమ్ముండునుగలరు. ఆపాండురాజునకు ధర్మరాజాదులగు నేవురుపుత్త్రులు గలరు. వంశపరంపరార్జితంబగు హస్తినాపుర రాజ్యంబుగాక మఱియు ననేకభూములను పాండురా జార్జించి వానికి రాజధానిగ నింద్రప్రస్థపురం బనుదాని నిర్మించి ప్రత్యేకముగఁ దన పరిపాలనమున నుంచియుండె. ధృతరాష్ట్రునికుమారుఁడగుదుర్యోధనుండు పూర్వార్జితం బగు హస్తినాపుర రాజ్యమును, పాండురాజస్వార్జితంబగు నింద్రప్రస్థపుర రాజ్యంబును తానే యాక్రమింపఁ దలంచి మాయాద్యూతంబున ధర్మరాజును సపరివారంబుగ నోడించి పండ్రెండువత్సరంబు లరణ్యవాసంబు

నొక్క వత్సరం బజ్ఞాతవాసంబును జేయ నొడంబఱచెను. తన్నియమప్రకారము ధర్మజుఁడు భ్రాతృకళత్రసమేతుఁడై కానల కేఁగె.

అంత నొక్కనాఁడు పాండవులు ద్వైతవనంబునం దేకస్థలంబునఁ జల్లనిభూజంబుక్రింద నొక్కటిఁగూడి పగతుఱ దుర్నయంబులకు మిగుల వగలం బొగులుచుండిరి. విధి నియోగంబునం గాఁగలయర్థం బెవ్వఁడు గడువ నోపు? ఎంతవానికేని స్వకర్మఫల మనుభవింపక తీరదు. అయ్యవసరంబున వేదవేదాంతార్థంబుల విశదీకరించువాఁడును, భూతభవిష్యద్వర్తమానంబులఁ దనయోగదృష్టిచేఁ గరతలామలకముగ నెఱుంగువాడునునగు మార్కండేయమహర్షి యఱుగుదెంచె. ధర్మజుండును సానుజుండై యెదురేఁగి చాఁగిమ్రొక్కి యర్ఘ్యపాద్యాదివిధుల నర్చించి యమ్మునిచంద్రుని సేమం బారసి సద్గోష్ఠినుండె. అట్టియెడ ధర్మసూనుండు “మునీంద్రా! ధనరాజ్యంబులఁ గోల్పోయి, మా ప్రాణంబుల కెక్కుడగు భార్యను సభ కీడ్చి తేరఁ జూచుచు, నవమానమున కోర్చి, నారలు గట్టి, నాకట్టిడికిం జిక్కి, ధార్తరాష్ట్రాదులఁ గీటడంపం జాలమికిఁ జాల వగచుచు నుడివెడి మావారల ప్రతిజ్ఞావచనంబుల వినుచు, నట్టడవుల నిడుమలఁ గుడుచుచున్నవాఁడ. మున్నెన్నఁడేని నాయట్టి మందభాగ్యుఁడగువాఁడు గలిగెనే? మీరు వానిం గంటిరే? వింటిరే? నాకంటెఁ గడునిడుమలఁ బడువాఁడు పుడమి నుండఁడని తలంతు. అట్టు లుండునేని యమ్మహితచారిత్రు ననురాగ మిగురొత్త నానతీయవే!” యని విన్నవింప మార్కండేయుఁ డాధర్మజుం గనుంగొని,

"అనఘా! దేవతుల్యులగుననుజులతో, విప్రులతో, ననేకులగు పౌరులతో, రథగజాశ్వాదిరాజచిహ్నములతో వచ్చిప్రవాసము చేయు నీవు వగచుట వింతయై యున్నది. తొల్లి హరిశ్చంద్రుఁడనుధరణీశుఁడు దనరాజ్యమును విశ్వామిత్రునకు ధారవోసి తానువసింప నూదిమోపెడునంతైన చోటులేక యొక్కఁడుఁడ కరం బిడుమపడఁడె? ఆపృథ్వీశునికథ తేటపడఁగ నుడివెద వినుము.

సరయూనదిపొంత భూభామినికిం దిలకాయమానంబును శాత్రవనికాయాయోధ్యయు నఖిలసిద్ధజనారాధ్యయు నగు నయోధ్యానా నొక్కపురీవరంబు విరాజిల్లు. అయ్యది ముక్తిదాయకంబులై యొప్పు నగరంబులేడింటం బ్రథమగణ్యంబై సూర్యకులవరేణ్యులగు రాజన్యులకెల్లఁ బరంపరానుభూతంబై యుండును. అందు సూర్యవంశస్థుఁడగు త్రిశంకు మహారా జేలుచుండె. ఆతండు శతాశ్వమేధంబు లొనర్చి దేవబ్రాహ్మణులం దనిపి రాజ్యభారంబు కొమారునియందుంచి తా సశరీరస్వర్గభోగం బనుభవింపఁ దలఁచి కులగురుండగు వసిష్ఠుం జేరి,

త్రిశంకు:—"ఆర్యా! హరిహరాది మేటివేల్పుల మహిమలు మీకుఁగలవు. మీరలు జగంబులనుబ్రోవ నడఁగింపఁ జాలియుందురు. కావున నను దివికనుపఁగరుణించుఁడు" అని పలుమఱు వేఁడెను.

వసిష్ఠుఁడు:—(నవ్వి) అయ్యయో! క్రతువులు నూఱొనర్చినను బహుసంవత్సరంబులు తపంబుసేసినను దానధర్మము

లెన్ని జేసిన నేరికిని నాకమునకు మెయితోడఁ జనరాదు. పోపొమ్ము. వెఱ్ఱిపోకలేల?'' యని గురుం డందుల కను మతింపఁడయ్యె. అంతఁ ద్రిశంకుఁడు వెఱ్ఱిపోకలఁ బోయినకతన నతనిఁ జండాలుఁడగునట్లు గురుఁడు శపియించె. త్రిశంకుఁడును గురుశాపవశంబునఁ జండాలుండై కౌశికునాశ్రయించి వేఁడెను. ఆతండును వాని వేఁడికో లియ్యకొని దివ్యమంత్రంబుపదేశించె. అంతఁ ద్రిశంకుండును గడుమోదముతో నక్షత్రపథమ్మున మునిసంఘం బద్భుతంబునఁజూడ గాధిసూను నభయంబున నేఁగుచు స్వర్గపట్టణద్వార సమీపంబుఁ జేర నట వాసవుకొలువునుండి యప్పుడే వీరభటాళితోడఁ జనుదెంచు యముఁడు తటాలునఁ జూచి,

''ఓరోరి! మాలపోఁత యళుకొంద కిటు నేడకు వచ్చెదు? తెరువెఱుంగవా? తొలంగు తలంగుము'' అనఁ గడుభయంబున గ్రక్కున మ్రొక్కుచు,

''అయ్యా! ఏను మనువంశసంభవుండ. త్రిశంకుండను వాఁడ. మద్గురుండగు వసిష్ఠుం బ్రార్థించి తనుస్వర్గంబు గలుగ ననుగ్రహింపుమన నాతండును నను దెగడి చండాలునిగా శపించెను. దానం బ్రాప్తంబైన యేతద్వికృతాకృతితోడఁ జనుదెంచి విశ్వామిత్రునికిం దెల్పిన నాతండు సన్మైత్రినాదరించి నాకంబునకుం బంచిన నేతెంచెద. మీరు విఘాతం బొనరింపకుఁడు.'' అనుచు సకలంబును నెఱుంగఁజెప్పెను. అందులకు శమనుండు నవ్వి,

''వీనిమెడఁబట్టి నెట్టుఁడు. పోనీకుఁడు'' అని నిజభటాళి

వలన వానిం దలక్రిందుగఁ ద్రోయించెను. అంతఁ ద్రిశంకుం డధఃపతితుండై యొప్పుచు "కుయ్యోమొఱ్ఱో, నీమాట నిక్క మని నమ్మిన నన్నుం దిక్కుమాలిన వానిఁగాఁ జేసితివే! శమ నుండు నీయానఁ బూనక నన్నిలం బడఁద్రోయించెను. దివికిని భువికిని గాకయుండు నను గావవే!" యన, గాధేయుఁడు "నృపాలా! నేలఁ బడ నీకేల? తలక్రిందై యుండనిలుము. నీవున్నచోట స్వర్గం" బని నిజతపస్సామర్థ్యంబున ననిమిష గ్రహతారకల నాకర్షింపఁ బ్రహ్మయు నందుల కేతెంచి త్రిశంకుకై స్వర్గ మలవరింప సమ్మతిల్లి కొన్నినక్షత్రదివిజ నికరంబు లాతనిం బరివేష్టింప నిలిపి చనియె. నాటంగోలెఁ గౌశిక మహిమాప్రదర్శకుండై త్రిశంకుఁడు మింటం దలక్రిం దుగ వ్రేలుచుండు. అప్పుడ కౌశికుండు బ్రహ్మదిసృష్టికిం బ్రతి సృష్టి నిర్మించుట యయ్యె. త్రిశంకుఁ డుండుచోటు త్రిశంకు స్వర్గంబు నాఁ బ్రసిద్ధి గాంచె.

ఇట్లుండఁ బురం బరాజకంబు గాకుండ పురజనులు వసిష్ఠ పురస్సరంబుగఁ ద్రిశంకుపట్టి యగు హరిశ్చంద్రునకుఁ బట్టంబుగట్టిరి. భానువంశశరధిచంద్రుండగుహరిశ్చంద్రుఁడును నిస్తంద్రుండై యఖండతేజుల రాజుల నాజులం బరాజితులం గావించి వారలచేఁ గప్పంబులం గొనుచు, భూరమణి నిసు మంతయేని కసుగందనీయక, ప్రకృతిరంజనులును, నిజబుద్ధ్యను వర్తనులును, వినయధనులును, విశ్రుతనయులు నగు నిజా మాత్యుల సాహాయ్యంబున ననయము సునయములచేతనుం బోలె, నిజధర్మపాలనమును జగద్వ్యాప్తంబుఁ జేసి కరుణో దారత భూతలం బలరింపుచుండె.

## చంద్రమతి జన్మవృత్తాంతము.

ఇదిట్లుండ, నిద్ధరాతలంబున సకలకలిమిబలముల కాకరంబై కరం బలరారు కోసలంబు నా నొక్కదేశంబు భాసిల్లుచుండు. అందు జ్యోతిష్మంతుం డనురాజు ప్రఖ్యాతుండై భూపాలనంబుఁ జేయుచుండె. అతం డఖిల వీరారి రాజన్యులం దైన్యంబు నొందించి భోగవైభవంబులఁ బురుహూతుం డనమించి, భూదేవ దేవతా పూజనంబులను వితరణ సద్గుణ వివిధ ధర్మంబుల నగణిత సత్కీర్తి నలరుచుఁ జిరకాలంబు భూభారంబు నిర్వహించి యుండె. ఇట్లాతఁ డంచితానంద ఫలదసంతానం బగు సంతానంబు లేమికి సంచలితస్వాంతుండై వగచి యాశ్రితావన పరాయణుం డగునారాయణుం దద్దయు భక్తిమెయిం గొలిచి పెద్దకాలంబు తపంబు సేసి తదనుగ్రహంబున మహితగుణయుత యగు దుహితం గనియె. ఆయమజన్మకాలము దుష్టలగ్నం బగుట యెఱింగి పురోహితు లజ్జనపతికి సంతానంబు గలిగియు సంతాపజనకం బగుదు వంత నొంది య య్యిలాపతికిం దెలుపరైరి. అంతఁ దల్లిదండ్రు లుల్ల మమర శిశువునకు జాతకర్మాదులు నిర్వర్తించి చంద్రమతి యని నామం బిడిరి.

అంతఁ జంద్రమతియుఁ బుట్టినింటికిఁ జెట్ట యయ్యు శుభోజ్జ్వలరూపాధికలక్షణాకృతులను విద్యా వైశద్యంబునను దల్లిదండ్రులకు ముదంబుఁ దలకొలుపుచుఁ బెరిమం బెరుఁగుచుండె. అట్లు శుక్లపక్ష క్షపాకరునివడువున దినదినప్రవర్ధమాన యగునయ్యింతి పదియాఱవయేఁట దుష్టలగ్నంబునఁ

ప్రథమరజస్వాల యయ్యె అయ్యది జననీజనక బంధుమిత్ర రథ గజవాజి సైన్యంబులును రాజ్యంబును నాశముఁ బొంది తానును విధవ యగునట్టి దుర్ముహూర్తంబగుటఁ గని తత్పురోహితు లీసుద్దినిఁ దమతేనికిఁ దెలుపక నిఁకదాఁచినఁ గృతఘ్నత వాటిల్లునని తలపోసి జ్యోతిష్మంతుండాప్త మంత్రిసహితుండై యుండఁగని యవసరం బారసి నరవరుందఱిసి, "దేవరా! చంద్రమతి తొలుతజనించిన లగ్నమతిదుష్టమగు టెఱింగియు లేకలేక కన్నకాన్పని వెలిఁబుచ్చమైతిమి. దానం జేసి యాయమపుట్టిన నాటంగోలె రాజ్యంబునకు సామ్రాజ్యంబునకు బాటిల్లుచేడ్పాటు లెన్నియోగలవు. కాలవశంబున నగువాని ననుభవింపకతీరదు గదా! ఇప్పుడాసతిఋతుమతియైన లగ్నం బంతకుం గ్రూరంబై కనుపట్టెడిని. అది నుడువ నోరురాదు, నుడువకుంట తీరుగాదు. చల్లకువచ్చి ముంత దాఁపనేల? రాజ్యవారణాశ్వసైన్య ధనధాన్యసచివయుతముగఁ దలిదండ్రులకుఁ గీడొదువఁ దానును విధవయై యుండఁగలదు. ఈసతి మీపాలిటిమృత్యువేకాని మీకు సుత యనరాదు. కానదాని నిఁక నిచ్చటనుండనిచ్చిన కడమయెల్ల నశించు" నని తమకు దూఱుదప్పినఁ జాలునని మోమోటమి మదిదక్కి తా మెఱింగినంతవట్టు దాఁపక విన్నవించిరి.

ఆదట నద్ధరావల్లభుం డుల్లంబునఁ దల్లడంబు పెల్లడర, మొదలంట నఱికినతరువు తెఱంగు దోఁప ధరణిం బడి మూరణించినవాని పగిది నొడలు మఱచి యుండె. అయ్యవస్థం గనిన మంత్రిపురోహిత ప్రభృతు లాతనిఁ గ్రమ్ముకొని సేదఁదేర్పఁగ, కొండొకవడికి జనపతి దెప్పిరిలి, మిగుల సంతాప

ముతో "ఈకట్టిడిజోస్యు లిది పుట్టిననాఁడె చెట్టయటంచు గిట్టింపుమనరైరి. నేనెట్టు లిఁకఁ దుదముట్టుదు? ఈప్రాయం పుముద్దుపట్టి నెట్టునెట్టనఁ దెగఁజూతు. కటకటా! మును నే నెంతటి పాపకర్మముం జేసితినో?" యని బిట్టువాపోవుచు, ఎట్టయెదుటం గనుపట్టు ధీవిజితవిబుధమంత్రు లగు నిజ మంత్రులం జూచి. "సచివులారా! మీరస్మదీయంబగు హానివృ ద్ధులకు బాధ్యులరు గాన మీబుద్ధిక్రమంబునం బ్రవర్తించెద. నిరపాయం బగుతరణోపాయం బెయ్యది?" యని వేఁడిన, "ఈయమ్మ జనియించుటాదిగాఁ బ్రాప్తంబులయిన యనర్థం బులు దోఁతంబు లాఁగదా? దుహితయనియొక్క నిమిత్తం బున మాత్రన సర్వనాశ స్వనాశంబుల నోర్వవచ్చునే! కృప జేయుటకు నర్హాంబుగా" దనువారును,

"ఇదెక్కడి మాట? జోస్య సాముద్రిక శకునస్వప్నం బులు సరిపడు, సరిపడవు గావున నిశ్చయం బనఁగూడునే? తొడిఁబడ నొకటిచేసి కడపట దుఃఖపడవలయుఁ గావునఁ బదరుట కుచితంబుకా" దనువారును,

"దురితహేతువులగు నట్టికర్మంబు లితరులు నిర్దేశిం చుటెట్లు? మీచిత్తవృత్తికి వచ్చునట్లు ప్రవర్తింపంజను" ననువారునునై పరిపరి రీతులఁ దెలుపు మంత్రుల వారించి, నయ విశారదుండను సచివవరుండు "నరవరా! విధిని గడచు టరిదియైన నాశామాత్రము నాకొక వెరవు దోఁచెడి నదెట్లన్న, జోస్యులమాటలు బూటకము లనరాదు. కడుపారఁగన్న కూన యని వంశహాని ఘటించుననను నిందంబొందిన దానిం

గావనురాదు. ఆఁడుపాపల రూపుమాపుటయు నుచితంబు కాదు. ఏదే నొకవిధంబునఁ బరిహరించుట మంచిది. ఈ యర్థంబునం దొక్కపురాత నేతిహాసంబు గలదు. దాని మనవి చేసెద, సావధానమతిం జిత్తగింపుము.

## —మ ణి మా లి కా వృ త్తాం త ము.—

మధురయనం బరగిన నగరరాజం బొండుగలదు. దాని నరిసంతాప కరంబగు ప్రతాపవితత ద్యుతిభానుండగు చిత్రభానుం డనురా జేలుచుండెను. వానికిఁ జిరకాలంబునకు సముద్రునకుఁ గమలయుంబోలె నొక్కకమలగంధి కూఁతు రై యవతరించెను. అదిశుక్లపక్ష క్షపాకర రేఖయనువున, దినదిన ప్రవర్ధమానయై యీడేఱి మణిమాలిక యను నన్వర్థ నామధేయంబువడసి గోమునం గ్రాలుచుండె. ఆనాతిమనో హరాకృతివిని దానింబెండ్లాడఁగోరి యనుపమాన సౌందర్య ఖనులగు మేదినీనేత లనేకులు దూతలనంపుచుండిరి. వేయేల? ఆ లలనామణికడకు బృందారకు లంపు రాయబారంబుల వెంట రాకపోకలం జేయుటంజేసి నారదునకొక్కచోఁ గాలూఁదినిలువఁ దీఱదయ్యె. ఎందఱెన్ని రాయబారము లంపిన నాచంపకగంధి యెవ్వరిని వరియింప మనసించుకయు లేక తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్లనుచుండెను. దానంజేసి దానితండ్రి;

"ఆహా! కుమారికామణీ!నీయావనసర్వ సుందరశుభా కృతికిం దగువరుం డెవ్వఁడు నివ్వనరాశివేష్టిత మహీంతలు నాకములందు లేకపోవునుగా!" యని సతతము చింతించుచు,

"జవ్వనియు నవివాహితయు నింటనుంచుకొని యున్నవాఁ"డ నులోకుల యాడికలకునోడి, యనురూప వరాన్వేషణంబు చే యుచుఁదనతలంపీడేర్ప నీశ్వరుం బ్రార్థించుచు దినంబులుగడు పుచుండెను.

అట్టియెడ నొక్కనాఁడు భక్తాభీష్ట దాయకుండగు వైకుంఠనాయకుం డారాయని మనస్తాపంబుఁ బాప నొక్క రాజపుత్రాకృతి వహించి యిలకుడిగ్గి రాజధాని కేతెంచి మోహనాకారలీల రాజమార్గంబునం బ్రగుమ్మరుచుండె. అట్టి సమయంబున మణిమాలిక జలకంబాడి కురులార్చుకొన పై మేడంజేరి యందుండి రాజమార్గంబునం జరియించు నారాజ కుమారుం గనులారఁగాంచి, వానిపై మనసుంచి, తనప్రియ సఖింజేరఁబిలిచి, "వాఁడెయొక్క సొగసుకాఁడు. అట్టివాఁ డెక్కడనైనఁ గన్పడెనె? ఆతం డక్కమలాయ తాక్షుండో? సురాధిపుఁడో? శంబరారియొ? చుక్కలఱేఁడో? నృపసూనుఁ డో? కలిమిచెలువపట్టిం దిరస్కరించు చెలువున వాడలబడిం జరియించు చున్నవాఁడు చూడుము. ముడికందని కురులల్ల లాడఁ, దలందాల్చిన రాచకుల్లాయ యంచుల ముత్యాల కుచ్చులు వ్రేలియాడఁ, జుంగులువాఱఁ, గటింగట్టిన జల తారు కోకచెరంగు జీరాడ, వీరవైష్ణవుండునుం బోలె నొస టఁ బట్టె నామంబు చెన్నారఁ జంద్రసన్నిభ ముఖాబ్జము వాని, ధవళాబ్జపత్ర నేత్రముల వాని, మెఱుఁగుఁ జామని చాయ మేనియందమువానిఁ, బటుతరాజాను బాహులవానిఁ, జారువిశాల వక్షమువాని, సింహమధ్యమువాని, హొయలునె న్నడల నడయాడువాని, నాసొగసుగాని, మనమున్నయెడకు

రప్పించుకొన మనసయ్యెడిని" యనుచు మైమఱచి చెలి మీఁద నొఱగెను. దానిచెలికత్తియలు నందుల కబ్బురపడి దానిని ఱొమ్మునఁ దిన్నగఁ జేర్చిపట్టి యొకనేర్పునఁ దెప్పిలం జేసి, యత్తెఱంగు రాణి కెఱింగించిరి. రాణియుఁ దోడనె యవ్వార్తఁ దన భర్తకుఁజెప్పి పుత్తెంచెను. అదివిని రాజు ముదంబంది "ఎట్టిమనోహర రూపవైభవా కారునైన నొల్లని మన మణిమాలిక కోరికొనందగు రాజకుమారుండెంత సుందరాంగుఁడో కనుగొందము. వేగఁజని తోడి తెం" దని చారులం బంచెను. వారాయేలినవాని యాన తలమోచి, రాచ తెరువున కేఁగి, యాసొగసుగానిం గాంచి,

"ఓ పంచశరాకృతీ! మా నృపతి మీరాక విని మిమ్ముఁజూడ నేకట గొనియున్నవాఁడు. మావెంటరా నవధరింపుఁడు." అనవుడు నమ్మాయలాఁడు, "అమ్మహామహు నెట్లుకాంచ నగునోయని విచారించుచుంటి. నాదగు భాగ్యవశంబున నాడఁబోయినతీర్థ మెదురైనట్టు లాపట్టభద్రుఁడు తానరావింపఁగంటి" నని పలుకుచుఁ దన తనుప్రభలు నలుకెలంకులం బరవఁ గొలువుకూటంబునకువచ్చి యచ్చటభద్రాసనాసీనుండై తనరాక వేచియున్నచిత్రభానుంగాంచి నమస్కరించి బద్ధాంజలియై నిలువఁబడ నారాజు నతని నుచిత సత్కారంబుల నాదరించి తనయెదుర నొక్కయున్నతాసనంబునం గూర్చుండ నియమించి సగౌరవంబుగా నిట్లనియె:—

చిత్ర:— ఓయికుమారశేఖర! నీయీరాక యెందుండి? నీయన్వయంబెద్ది? నినుంగన్న సంపన్నులెవ్వరు?

నీపేరేది? ఊరేది? నీయీరాకకుం గతంబేయది? ఇందుండి యెందులకుఁబోక? నాకడ నెద్దియుదాపక తెలుపనగును'' అనుటయు,

రాజనందనుఁడు— ఈలోకంబున నిజంబపలుకువారును పలికినదియె నిజంబనినమ్మువారును నెవరు? కొన్నియెడలనిజంబెబొంకగు. బొంకెనిజంబగు. కావున, నేనిజంబెకా నాయుదంతంబాద్యంతంబు విన్నవించెద. అయ్యది మీకు నిజంబగునో, కాదో? సాదరంబుగ నవధరింపుఁడు.

ఇయ్యిలం బేరెన్నికంగన్న రత్నాకర పురంబుమాకాపురంబు. నేరాజాన్వయసంభవుండ. కాశ్యపగోత్రుండ. వెన్నెలగంటివారు మాయింటిపేరు. నాపేరు శ్రీపతి,నాకుఁ దలిదండ్రులు కలరుగాని వారిప్రోపునేఁ బ్రాపింప. దైవికంబునం బ్రాప్తంబైన కలిమిబలుములంజేసి నాయంతనె పెరిగినాఁడ. వేనోళ్లంబొగడుఁగన్న లాఁగలోఁగిటి భోగరాజును, బకుపాతవర్తనులకు రాజై విరాజిల్లు తలబొల్లిపులుగురాజునుడకపడకల ననుంగాపాడఁ బూఁటకాపులై యున్నవారు. మామామ కమలపతి. భామకమల. దానివలనిప్రేమాతిశయమునుంజేసి ''పసచెడియత్తింటఁ బడియుండరోఁత, పరువుదప్పినయెడ బ్రతుకురోఁత'' యనునీతినిమాలి శ్వశురగృహంబ పరమసుఖంబని యిల్లటంబుండ నియ్యకొంటి. అదియ నెపంబుగా నాచపల తాశ్రీమంతురాలని చెలరేఁగి ''యిటుర'' మ్మన్నవేగ ఆ మ్మొక్కుచు, నేగీమునందానయ్యె, మందెమేలంబున ''అమ్మా! నీవుజగముతల్లివి, మాపాలిటి కల్పవల్లివిసుమ్మా'' అన్నవారికవ్వారిగసిరులొసంగందలపడియె. లేకలేక యొక్క

కొడుకుగలుగ, వాఁడు మేనమామ పోలికలం జెలంగి తనకం కెఁజక్కనివారు లోకంబున లేరని నిక్కుచు నీశాపరాధలేశం బున నంగహీనుండయ్యె. న న్నిల్లట ముంచుకొన్న మామ యన్ననో మేరలేని రత్నరాసులగడించికొని రత్నాకరుండనం బ్రసిద్ధుండయ్యు నప్పుల మునింగి భంగసంగతుండై యున్న వాఁడు. అట్టివానియింట నిల్లుకొల్లపెట్టి నిల్లాలిం బెట్టుకొని వేఁగుటకన్న వైరాగ్యంబవలంబించుట యోగ్యంబనివిచారించి, సర్వసంపదలు పరిత్యజించి, యిట్టిసాంగత్యంబెప్పుడు బాయు దునాయంచు నూహించి, యిల్లట ముండియుండి వేసరి మది రోసి దేశాటనపరుండనై వెడలివచ్చి చరించువాఁడ. మార్గ వశంబున నిటవచ్చితి. సచ్చరిత్రులరగు మీసన్నిధిం బ్రాపింపఁ బాతుండనైతి. నాకుఁ గలిమిబలుములపయిం గాంక్ష లేదు. కావున నిప్పు డెందేని యన్నవస్త్రంబులిచ్చి యాదరించు వారున్న వారింగొలిచి పొట్టవోసికొనుచుండ నిచ్చ పుట్టె. నన్నాదరించి నిలుపు చుట్టములున్న నిలుతును. నే నిట్లంటి నని నన్నసదుగ నెన్నకుఁడు. వలయునన్నఁ జలపట్టి జలరాశిం జొత్తు, కొండ పైనొఱగినను వెఱువక యానుకొందును. సర్వ మేదినీభారంబైన వహించి పుడమి నుద్ధరింపం జాలుదును. మనుజసింహంబన ననికిఁ జొచ్చి బలపరాక్రమంబునం జెలం గుదు. మెఱసి మహత్వత మిన్నంది వెలయుదు. రాచపురుగు లంగన్న నేచి పీచంబడంతును. బహుముఖంబులం బెఱిగివచ్చు పగఱనైన దఱుగ వెనుదీయను. బలభద్రుండన బలియురగు పగతురం జెండాడనేర్తును. దుష్టజన మానినీ వ్రతనిష్ఠలం గొలసేయఁ బ్రబుద్ధుండను. దుష్టులం గలంచుటకై కలికితనం

బునం బ్రవర్తింపనేర్తు. అవియెల్ల నిప్పు డుగ్గడింపం బగ్గెలని
తోఁచి కట్టిపెట్టితి. ఎట్లుతోఁచిననేమి? నాపుట్టు పూర్వోత్త
రంబుసర్వంబును వినిపించితి. నిక్కముగనాపైన నక్కఱతో
మక్కువకలిగిన నిక్కడ నిలిచెదను. లేదా సెలవొసంగుదు
వేని గ్రక్కున నెక్కడకైనం జనఁగవలెను. కావున నన్నిటు
రప్పించినపని యానతిచ్చి సెలవిచ్చినం బోయివచ్చెదను'' అని
యె. చిత్రభానుండు నందులకు మనంబలర,

చిత్ర:—''శ్రీపతీ! నీచరిత్రం బతిచిత్రంబును బరమ
పవిత్రంబునునై యున్నది. దానివినికిం జేసినాశ్రోత్రంబులానంద
పాత్రంబులయ్యె. కాశ్యపగోత్రులు మాకుఁబోరాని చుట్టములు.
వారియింటఁబుట్టినందున నీవునునాకువిందవైతివి. నీకెం దేనిఁబో
నేల? ఊరూరుతిరిగి యూరక పేరుపెంపు చెఱుచుకోనేల? మా
బాలసుగుణశీల. దానిరూపమునకుం దగువరు నెవ్వనిం గానక
దానికి నేటిసరికిఁ బెండ్లిసేయకున్నాఁడను. ఆకన్నె నిన్నుఁగ
న్నంతనె వలచెనఁట. దానిం బెండ్లాడి నీకు మున్నుఁగలిగియుం
డిన కొఱంతలెల్లవీడి మాచెంతనె నివసింపుము. లేనిపోని
శంకలు దెచ్చుకొని నొచ్చుకొనకుము. వలయునేని నాదగురా
జ్యమునకుఁ బట్టముం గట్టుకొమ్ము. మమ్ము మావారినెల్ల నే
లుకొమ్ము'' అనిచెప్పెను. అందులకు శ్రీపతియు,

''మీరలుప్రీతితో మీసుతనిచ్చుతెఱం గది నిక్కవం
బేని, సంసారంబురోసి యిల్లువాసి యెల్లసిరుల నెడఁబాసి
వన్నెవాసి చెడి గాసిల్లు పరదేశియెక్కడ? ఎల్లసిరులకు మనికి
పట్టైవర్తిల్లు మీయనుంగుపట్టి యెక్కడ? పెండ్లియగుట

యెక్కడ? నాయెడఁ బ్రేమకలదేని నావలనఁ దగిన యూడి గంబు సేయించుకొనుచు నన్నేలుకొనుఁడు'' అని చెప్పెను.

రాజు:—''అదిమాటకాదు. నాప్రియపుత్రికం బెండ్లి యాడి నాయింట వసియింపవలయును'' అని నిర్బంధించెను.

శ్రీపతి:—''జగము నేలికలగుమీమాటమీఱినడచుట యనుచితము. కావున నయినది కానిండు. మీచిత్తం బుకొలంది నడచెదను'' అని మెత్తపాటు సూచించెను.

అంతట నారాజసత్తముండును నదియ సుముహూర్తం బని సకల బంధువులం జేర్చి వారౌననఁ బారబార్హ్మణ సమ క్షంబున మహావైభవంబుతో నమిత వినోదవాద్యములును నాగమఘోషణములును నుల్లసిల్ల నగ్నిసాక్షిగ నెఱవేర్చెను. అదిమొదలాయల్లుఁడు కొన్నియేండ్లు మధురాపురంబున నెమ్మనలందుచుండి యొక్కనాఁ డేకాంతంబున భూకాంతు నవలోకించి,

''మామా! మీమన్ననలం జేసి కనిపెంచినవారి నెడఁ బాసిన కొఱంత నెఱుంగక సుఖంబుగ నిన్నాళ్లిందుఁ గడపి తిని. ఇప్పు డొకతూరి యూరిదాఁకఁబోయి మావారిం జూడ మనసయ్యెడిని. సెలవిచ్చితిరేని పోయి తల్లిదండ్రులను బెండ్లా ము బిడ్డలను గనులఁజూచి వేగవచ్చెదను. వారందఱు నింతకు నాపోబడి గానక యెంత సంతాపముతో గజిబిజియగుచు న్నారో? ఏమైరో? కాదనక నామనవి నంగీకరింపుఁడు'' అని మిగులఁ బ్రార్థించెను. రాజును గడుందడవువిచారించి ''అల్లుఁ డా! నీబూటకంబు లేమనవచ్చును? నాఁడనినమాటలు నేటికి

లేకపోయె. నాఁడు నాకెక్కడనైనఁ గూడునుగుడ్డయునిచ్చి యాదరించువారున్నఁ గొలుచుచుందు నంటివి. నేఁ డామాట యేటఁగలిపి చుట్టాలఁజూడ మనసయ్యె ననుచున్నావు. ఇది నీకుఁజెల్లునా? ఇల్లుకొల్లవెట్టి నిల్లాలిపై మనసురోసిన పరదేశి నంటివి. తల్లిదండ్రులపోషణలోనుండక యిల్లువాకిలి విడిచి వచ్చినవారికి నయినవారిం జూచి వచ్చుటకుఁ దలఁపు పుట్టుటయున నెట్టిది? నాఁడె యీజాడఁ దెలిసియుండిన మా కీడగుదారింజూచుకొనమె? రాచకుమారుండవనియు నందును గాశ్యపగోత్ర పవిత్రుండవనియు మాముద్దులపట్టిం జేపట్టించితిమి. అందుల కిప్పు డుప్పుచప్పని మాటలాడి యాడుకొనం జూచెదవు. రాజకులశ్రేష్ఠులకుఁ గల్లలాడ మేలా?" అని నిష్ఠురంబులాడెను.

శ్రీపతి:— ఔరా! మామా! ఎంతమాటలాడితిరి? మీ రింతనిష్ఠురంబు లాడంజూతురని కలనైనం దలంచిన వాఁడనుగాను. కానున్నది కానిమ్మని మీ యానిష్ఠురోక్తులకు వెఱచి మావారి చెంతలకుం జేరక నేనింద యుందునేని నేఁడు గాకున్నఁ గొన్నాళ్లకేని మావారు నన్ను వెదకుచు నిట వత్తురు. వచ్చినవా రూరక పోనోపరు. మీరు కన్నెనిచ్చి తమపై మచ్చిక మఱపించి నన్నింటనుంచు కొంటిరని యొంటనిమాటలాడి మిమ్మాడికలం బఱతురు. నాకుఁగా మీకొక లోపంబు ప్రాపింపనేల? ఈపయనము మిమ్ముబొంకించి సురుంగంగాదు. అల్లెంతురేని మీరుపొమ్మన్నను నేఁబోనోప. మీ పాపపై నాకుఁగల ప్రేమంబైనఁ దలంపవలదా? వలదనక సెల వొసంగుఁడు. వెసంజని ననుఁగానక మనికితపడు చుట్టాలం

జూచి వారేమన్నను దగంజెప్పి వారలఁ దాళఁబలికి వైళంబ
వచ్చి యిట నేనెన్నటికిని నిలిచెదను. మీకు యశంబుఁ దెచ్చె
ద'' నని పెక్కులు తక్కరి ప్రియంబులు వక్కాణించి యెట్ట
కేని నాపట్టభద్రు నియ్యకోనం జేసి మణిమాలికా నిలయంబు
సొత్తెంచి వినయంబుఁ బెంచి తన యభిప్రాయం బాయువిద
చెవి నల్లన సోఁకించెను. అంత నక్కాంత పెనుగాలి తాఁకునం
దూలు నెలతీఁగ చెలువునఁ జెలువుమాలి తాలిమిదూలి సోలి
నేలకొఱగి మేనుమఱచెను. అదిగని శ్రీపతియాపరానికూరిమిం
దానిఁ దిన్నఁగ లేవనెత్తి తేర్చి యూరార్చి,

శ్రీపతి:-''ఓమనోహారిణీ! నీమనసరయఁగోరియట్లంటిఁ
గాని యొక్కనిమేషమేని నిన్నెడఁబాసి యుందునా?
ఉన్నను గాసింబడక మందునా? ఆమడలు దూరమైనను
హృదయకమలములు దవ్వగునే? నామది యెచ్చోనున్నను
నీమీఁద నె తవిలియుండును'' అని పలికి యయ్యింతి యెంత
బతిమాలినను వినక పయనంబునకుం ద్వరపడి యమ్మంజు
వాణితో మంజులతర వాక్సుధారసంబుచిలుక నల్లన నిట్లనియె:

''చంద్రాననా! లోకమర్యాదనూఁదినాకడ్డంబు సెప్పక
యీనాపోకకనుమతింతువేని నేనెవ్వరికిని దెలియక రాకపోకలు
సలుపుచుఁ బ్రవర్తింతును. పిదపఁ బొందరానిపదవి నీకొదవిం
చెద'' నని చెప్పి మణిమాలిక నొడంబఱచి వనమాలిక కను
మొఱంగెను. అంతఁ గొన్నియేండ్ల కాసన్నుతాంగి గర్భంబుఁ
దాల్చెను. ఆజాడ దెలిసి దానిచెలికత్తెలు గుసగుసలాడుచు
నిద్దిదాఁచిన మనకు దోసఁగువచ్చునని మెల్లన భూవల్లభుం జేరి,

''నరవరా! మీ వరకుమారిక మగనిఁబాసిన నాలు

గై దేవులకుఁజూలుదాల్చె. అందులకుఁగారణం బెయ్యదియో దైవంబగాని యొరులెఱుంగరు.” అని విన్నవించిరి. మన్నుఁజేఁ డదివిని యదటిపడి,

“ఔరా! శ్రీపతీ! “అతివినయం ధూర్తలక్షణ” మ్మనుట నీయందె చరితార్థం బయ్యెఁగదరా! తక్కుపిక్కు నెఱుఁగని మమ్ము నేరిమిపలుకులం జొక్కించి యేమియుఁ దెలియని మాపినపాపం బెండ్లియాడి పాపభీతి పోనాడి చుట్టాలఁ జూచు నెపంబున విడనాడితివి. అపయశంబుం బొసఁగించితివి. దీన నీకేమి మేలువచ్చెరా? దీని విన్నవా రేమందురు?” అని యెదం బొదలు నదవదం గుదురుపాటు కననేరక కుందికుంది తుదిం దెలివొంది, “ఎదటఁగన్నది చేత, ఎదానఁబెట్టి నదివాత” యన్నట్టు మనపిన్నది ప్రత్యక్షంబుగఁ గడుపు తెచ్చుకొన్నది. ఎన్నరాని కడగండ్లంబడి కన్న కన్నియ యని యూరకున్నం దీరదు. తగవుదప్పిన నప్పరమేశునకేనిం దెప్పరంబు దప్పదు. కావునఁ దగవుపూని యీదుస్సంగతిం బాసి వాసిగాంచెద” నని ధైర్యంబవహించి కూఁతుంద్యజింప నిశ్చయించి నాఁటి రాత్రి నిద్రాసక్తయగుదాని నొక్కమందసంబునం బొందుగా నిడి పురిపరిసరంబుననున్న మహాతటినీ ప్రవాహంబునఁ బడ వైపించెను.

ఆవెల్లింబడి యామందసం బమందజవంబున నంబుధిం బ్రాపించి, యమ్మహార్ణవంబున డోలాయమానంబై యుండ నయ్యంగన దానం గ్రిందుమీఁదై, యందందుఁ గొట్టుమిట్టాడు మందసంబునం దందరగొని మేల్కని కలయనుకొని మెలఁకువకలిమిం గలకామిం దెలిసి “తన కరయో యిట్లాప

త్పరంపర యేమొకో దైవమా” యని గుండియలుబగిలి దిగు లొంది వడికొట్టునం దడంబడు పెట్టియంబడి దైవకృత్యంబునం బ్రాణంబు వెడలమి నలసి, తనగతికిం గారణంబుం దలపోసి, ధైర్యం బెడంబాసి,

“ఓయమ్మ! ఓయక్క! ఓయయ్య! ఓయనుంగులార! ననుంగావరే! నా మొఱయాలకింపరే! నీరథిం బడంద్రోయ నేంజేసిన యపరాధంబైనం దెలుపరే!” యని తనవారి నెల్ల సారెసారెకు వేఱువేఱ జీరి, మారుమాట వినంగానక పురాకృత సుకృత పరిపాకంబునం జనించిన సుజ్ఞాన విశేషంబునం జేసి యరవిందాక్షుండ తనకు రక్షకుండని విచారించి యవ్విరించిజనకుం బలువిధముల నిట్లు ప్రార్థించెను:—

“ఉ॥ ఓజగతీవధూరమణ! ఓచతురాస్య ముఖామరస్తుతా!
ఓజితదానవప్రకర ! ఓయమితాబ్జభవాండనాయకా!
ఓజయశీల! ఓవరద! ఓమునిసేవిత! ఓముకుంద! రా
వేజడధిన్ మునుంగుననువేంగనవే! కరుణింపవే! హరీ!”

“సీ॥ తనతండ్రిచేత నత్యంతబాధలవేంగు
ప్రహ్లాదు నేలిన పరమపురుష!
ఘనతరాగ్రహ బలగ్రాహంబుచేం జిక్కు
ద్విరదాధిపతిం బ్రోచు దీనరక్ష!
కుటిలదూర్వాసుని కోపాగ్నిం బడకుండ
నంబరీషునిం గాచి నట్టివరద!
యమకింకరులచేత నగపడు నయ్యజా
మిళుం బాలించిన మిత్రతేజ!

ఆపదలునిల్చునే నిన్ను నాత్మఁదలఁప ?
లీలతోనేఁడు నా మొఱాలింపుమీవు
యబ్ధిశోకాబ్ధు లిరుగడలావరించె
దరినిడు కటాక్షతరిని నిత్తఱిమహాత్మ!''

ఇట్లని ప్రియురా లిడు మొఱ యవ్వనమాలి యాలించి కనికరించి, కడలిం దేలియాడు నమ్మందసంబుతో దానిం దన సన్నిధానంబునకుం గొని తేర వైనతేయుం బనిచిన, ఖగేశ్వరుండును గడువడిం గదలి పరువిడి జలాశయంబులం జరించు మీలందన్నుకొని యెగయున ట్లమ్మణిపేటిక నిరుగేల నిఱికికొని మింటికెగసి వాయువేగంబునం బఱచి వైకుంఠధామంబునఁ బడగలెత్తు చిలువపీఠంబున నిండుకొలువుండు మందరధరు మ్రోల నానందమొలయ డించెను. అంతనమ్మందరనగధరుం డమందానంద భరితుండై మందస్మితముసేయుచు నమ్మందసముఁ దానె తివియ మందగమనయు వెడలివచ్చి మకరకుండలకేయూరాద్యలంకృతుఁడై సాక్షాత్కరించు పుండరీకాక్షుంగని యతులిత భక్తిశ్రద్ధా సమన్వితయై, "సర్వలోకాభిరామా! చారుసత్కీర్తి సోమా! జగదీశా! సాధుభావప్రకాశా! శత్రురాట్కంఠపాశా!" అని వినుతించుచుఁ గృతాంజలియై "దేవా! తావక చరణ సేవామరంద రసస్వాదనంబు సేయనబ్బె. పాపమువాయ ధన్యతనొందితి. నా మొఱాలకించి యబ్ధిమునుంగనీక నాజీవము నిలువఁజేసితివి. నావిన్నపంబాలకింపుము. మథురాపురంబేలు చిత్రభానుం డనుపార్థివుని పుత్రికను. నామదికోర్కిం గాంచి నన్నొక్క రాజ సుకుమారునికి మజ్జనకుండు పెండ్లిసేసె. అరాసుతుం డందఱతో నూరికిఁ

బోయి వచ్చెదనని చెప్పిపోయి నాయంతఃపురంబున కెవ్వఱు నెఱుంగకుండ రాకపోకలు సేయుచుండె. నే నొరుల కత్తెఱం గెఱింగింప వెఱచియుంటి. అంతఁ గొన్ని వత్సరములకు నేఁ జూలాలనైతిని. మజ్జనకుండావృత్తాంతం బెఱింగి కరుణయొకింతయు లేక నే నిద్రించుచుండ ననుం గడలిం ద్రోయించె. ఓదయామతీ! పతింబాసి యుంట నాయట్టి కులకాంత కెంతయు ధర్మువగునే? కావున నీవు దయామతివిమై నాపతి శ్రీపతిచెంతకుం జేర ఘటియింపం బ్రార్థించెద"ననియె. అమ్మందరధరుండును మందహాసంబు సేయుచు,

"ఓ రమణీ! నీదగునవలావణ్యావై భవంబు దేవమునియగు నారదునివలన విని కరం బనురాగంబు మనంబు బెనుపొంద నీవలచుమార్గంబుం దలపోసి చాల హాయలు మీఱఁ గైసేసి మీరాజధానిం బ్రాపించి, మీయయ్యకు లేని చుట్టఱికంబుఁ దలఁపించి నినుంబెండ్లాడి వీడిన శ్రీపతి వీఁడె యున్నవాఁడు చూడుము. నేనై నిన్ను రప్పించిన మీవారు నినుంగానక యడలుదురని నే నిట్లొనరించితిని. ఆ నా నరవరురూపముం జూడుము" అని తన నరవరుని యాకృతిని వహించి నిలిచెను. మణిమాలికయు నాతని నిజనాథుగాఁ గనుంగొని మనంబున సంతసించి లజ్జపెంపునం దల వాంచి తనపడిన యగడెంచి కళవళింపం దొడంగె. శ్రీపతియు నయ్యింగితం బెఱింగి యామె నొకదివ్య భవనంబునందుంచి, పరిచారికా సహస్రంబులు గొలువ సకల విభవంబు లొనరించి యతిప్రేమతో లాలించియుండె. కొన్నాళ్ల కాచెలియు నొక్క చిన్నికుమారునిం గనియె. ఆతండు విష్ణువర్ధనుండను

పేర వెన్నుని ప్రతిబింబంబగుచు వృద్ధినొందెను. అంతఁ గొన్నాళ్ల కాతఁడె శాల్మలద్వీపమున కేలికయై నిర్జరత్వం బుం దాల్చియుండెను.

కావున మీకు మారిగఁ బుట్టిన మీ కుమారిం జిత్రభానునియట్ల పరిత్యజింతు రేని దానిం జెందిన నింద మాయు. మీ నెంజిలియుఁ బాయు" ననియె. భూపతితనయహూత్యుని హితముంగైకొని పైకొనువిచారంబు మాని బుతుస్నాత యగునంతకుం గూఁతు నేకాంతగృహంబున నుంచి యాసంచు నాప్తె కెఱుకపడనీక యుంచె. అయ్యంచుఁ బోఁడియు నించు కేని యాసంచు నెఱుఁగక నిద్రించుచున్నతఱిదాని నొక మందసంబున నొప్పఁగ నిడి తాళంబులు గీలించి దెప్పరముగ మునుఁగకుండఁ దెప్పయిన్నేరొప్పు నదియందుఁ ద్రోయించె.

అంత నమ్మహాతటినీ ప్రవాహంబునం బడి నెదురుదట్టు నుదకంబులలో నిరుదరులం గనుపట్టు గట్టులం దాట్టుచు నమందసరణి మందసం బేఁగుచుండె. అందుఁ బఱుండిన యబ్బాలిక మేల్కని లేవను గూర్చుండ ననువుగాక యంతకు మున్ను తన్నుగుఱించి తనవా రాడుకొన్నకొఱగామలు కర్ణాకర్ణిగ వినియుండెఁగాన మిన్నొఱఁగిపడినట్లడలి "అయ్యయో! మాయయ్యకన్నకానుపన్నమాట తొలఁగఁబెట్టి యాఁ గాదనక కట్టిడియై జన్నిగట్టులమాటలు బాటిగాఁ బటి నన్ను నట్టేటఁ ద్రోయించియుండనోపు. కాకున్న నా కీపెట్టియంబడి యిట్లు కొట్టుకాడనేల? ఇప్పాటం జాలిఁబెట్టుకంటెఁ బట్టెంబుఁ గొని తలఁ దెగఁగొట్టినం బోలదా? జోస్యులారా! నేఁడన్నమాట చిన్ననాఁడె యని పున్నెముం గట్టుకొన్నఁ గాదాయెనా?

మిమ్మన నేల? కన్నవారికిఁ గరుణలేకపోయె. నాయనకుఁ దెలియఁజెప్పియైననన్నుఁగావఁ జూడక పాడుజోస్యుల మాటలు విని కీడుమేలనక యిట్లు తల్లడఁబెట్ట నీమన సెట్లోర్చెనే తల్లీ! అయినవారె యిట్టివారుకాఁగా నింకనన్నాదరించువా రెవ్వరు? నాభాగ్య మేమనవచ్చు? ఇంతలో నీముట్టు నొకటిమూఁడె. ఈగతాగత జలపక్షిసంకుల కలంకలంబె ముత్తియిదువ పాటలయ్యె. ఈవాహినీభవ మందతరంగ ఘుమఘుమ ధ్వానంబులె వాద్యఘోషంబు లయ్యె. ఈధాళధళ్యద్యుతు లుల్లసిల్లు నాపగాప్రాతంబె దడమంపుఁబాను పయ్యె. ఈజిగి సంతనపు నునుప్రాని పలకల గొప్పమందసంబె శృంగార భవనంబయ్యె. ఆహా! నేసమర్తాడిన యుత్సవంబిట్లునెఱవేఱుఁగా? నాయాఁడుఁబుట్టు విట్టుల ఫలియించెంగదా!'' యనుచు నెలుఁగెత్తి యేడ్చుచు,

''దిగీశాది దేవతలారా! చిక్కులంబడి దిక్కుఁగానక సుక్కు నామొఱయాలింపరే! ఓనదీమతల్లీ! తల్లిదండ్రు లొల్లని కల్లలాడి యనక చల్లని తల్లివని నీ కడుపుచొచ్చిన ననుంగావవే!'' యనుచు, వరుసంబెట్టి మొఱఁబెట్టి, యెన్నువలు వెట్టుచు బిట్టు నేడ్చుచుండె. తన్నదీపరిసరాశ్రమంబునఁ దపంబుసేయుచున్న మయుం డనుసంయమి యయ్యేడ్పు టెలుంగు విని, నేత్రములు విచ్చి, యం దేరిం గానక దవ్వుల వెల్లివెంటం బోవుమందసంబు గాంచి, శిష్యులం బంచి, దరికిఁ దెప్పించి, తాళంబులు దీయించి, యం దొకసర్వాంగసుందరి యగు మంగళాంగిం దిలకించె.

మయుండును''ఇయ్యది నిద్రాహారంబులుగానక నవయు

ననిమిషావలింగ్గైకొనక సకలసుఖాస్పదులయి మను మనుజులం గలసి వర్తింపవచ్చిన యచ్చరకన్నెయో! కాకున్న నీ చెన్ని సంపన్నత యీ విలాసంబును నేవిలాసినులకుఁ గలదు?" అని తలపోయుచుండె.

ఇంతలో నమ్మందయాన సూత్రధారుండు వెలువరింపం దెర వెలువడి నాట్యరంగంబునకువచ్చు కీలుబొమ్మయచ్చున మందసనుండి వెలువడి, కన్నులవెంట నోడిగిలు నశ్రువులు చేలాంచలంబునం దుడిచికొనుచు ముఖారవిందంబు నావరించు ముంగురులం గోరుల నెగదువ్వుకొనుచుఁ గరుణామయుండగుమయునిఁ గాంచి వినయ వినమితోత్తమాంగయై మ్రొక్కుటయు నమ్మునీంద్రుండు "దీర్ఘసుమంగలీభవ" యని దీవించి దానిసేమం బారయనామెయుఁగొంత యాత్మభయంబు దిగనాడి ఖేదముడిగి యించుకవనతాననయై "అయ్యా! ఏను జ్యోతిష్మంతుని సుత చంద్రమతిని. నేఁ బుట్టినదినంబు పుట్టనింటికిం జేటుబుట్టినది యని విప్రులానాఁడు దెల్పఁగొంకి, యిప్పు "డీసమర్తాడిన వేళ యంతకుంగీడు. అఖిలరాజ్య ధన ధాన్యవస్తువాహన స్వజనయుక్తముగ నాశంబునొంది దాసియై వైధవ్యముంబొంది యడలుచుండఁగలదు. కాన వర్జింపంజను" నని వచింప, నాతండ్రి యదయుఁడగుచు నన్ను నదింద్రోయించె" నని తన యుదంతంబంతయుఁ బూసగ్రుచ్చినట్లు వాక్రుచ్చె. అప్పు డమ్మునివరుండు నవ్వుచుఁ దన యోగదృష్టిని యావద్వృత్తాంతం బెఱింగి,

"అమ్మా! నీవుమ్మలింపఁ బోకుము. శాస్త్రములు కల్లలుకావు. జోస్యు లాడినంతవట్టు నిక్కువంబ. అయ్యును

నాయిచ్చిన దీవనచే నీకు సౌమాంగల్యంబు తప్పక ప్రాపించు. ఆపద లెన్నఁటికిని బీటబెట్టుకొని కాపురము సేయవు. నీకు రాను న్నయాపద లబ్దంబులోఁ గడ తేరును. విచార ముడుగుము. నా పేరు మయుఁడందురు. నా కూరిమి దుహితలలో నీవు నొ క్కర్తవ వని నమ్ము. నీపుట్టుకం దొట్టిన కీడుల కన్నింటికి ముఖ్య చిహ్నంబుగనుండునది నీగళసంబగుమంగళసూత్రంబ. అయ్యది నీప్రియునకుం దక్కఁ దక్కిన వారలకుఁ గాన రాకుండు. నాతపో మహత్వంబునఁ దద్వైధలం దొలంగించెద. నాసుత మందోదరి యొకటి నీవొకటియుంగాదు. తొలుత దీవించిన పలుకుఁ జెల్లిం చెద. నీకాంతుఁడు నీదుకంఠమునఁగట్టు మంగళసూత్రము నీ కాంతునకగాని యొరుల కెరికైనం గోరంతయేనిఁ గనంబడ కుండఁజేతు. అందున నీవు విధవ వౌదు వనుగోసముందీరు.''వని తా నె విశ్వకర్మగావునఁదనయాశ్రమంబంద తన నేర్పు మెఱయ మెప్పులుగులుకు నొక్క దివ్యసౌధంబు నిర్మించి, యంచిత పరిచారికా సహస్రంబు గల్పించి, యం దాచంద్రాస్య నిచ్చపాదలం బెనుచుకొనుచుండె. అక్కాంతయుఁ దనయెదం గదురుకొనిన యదవద కదల మయుని యుపదేశవాక్యము లుత్సాహముంగూర్చ నూరడిలి ఖేదం బపనయించి, తాలిమి వహించి, యరమర దొలంచి, మునికన్నెలు మించిన కూరిమి నొనరించు నంచితోపచారంబులందనువుగాంచి, పరమానంద భరితాంతఃకరణయై యయ్యాశ్రమంబున వసియించియుండె.

## చ ం ద్ర మ తీ వి వా హ ము

అంతట వసంతంబు సంప్రాప్తంబగుడు నొక్కనాఁడు

చంద్రమతి మత్త మధువ్రతావృతంబులగు పుష్ప నికుంజ పుంజములచే రమ్యోత్తరంబై తనరారు మయునాశ్రమంబునఁ బొన్నగున్నలనీడలఁ జెలికత్తెలంగూడి డాఁగిలిమూఁతలాడుచు, వృక్షపుంజంబుల వివిధకుంజములచే నలరారుదీవెలల నుయ్యేల లూఁగుచు, నొప్పుగా వెన్నెలకుప్పలాడుచుఁ, బుష్పాపచయంబు సలుపుచు ముచ్చటలరఁదచ్చన లాడియాడి బడలిక లొదవ, వనజల విహారంబునకుం గడంగి, తన యుద్ది ముద్దియలం గద్దించుచు, నొండు మచ్చెకంటులతోఁ దననేరిమిం జదురు లాడుచుఁ, గరంబులుసాచి యెదురఁజనుదెంచి తాఁకుతరంగంబు లకునులుకుచు, సారసంబులకుం గరంబులుసాచుచు, మరాళంబు లం జోపుచు, మోముదమ్ముల కమ్మఁదనమ్మునకు మూఁగి జుమ్మురను తుమ్మెదలకు వెఱచుచుఁ, గరంబుల నీరెగయం జఱచుచు, సరసభాషణంబులం ద్రుళ్లియాడుచుఁ, గేకలిడుచు నోలలాడుచుండెను. ఇట్లు చెలరేఁగి పలుతెఱంగుల జలక్రీడ లాడియాడి తనిసి, యా విరిబోఁడు లొండొరులం గలిసికొని కొలనువెలువడి తలల యొడళ్ల తడియొత్తికొని, తమతమ పైడియంచు చెఱఁగువెన్నెల దుప్పటంబులు గట్టుకొని సముచి తాభరణాలంకృతలై యొక్క సరోవరతీరంబునఁ దమాల తరుచ్ఛాయంబడలికలువాయ విశ్రమించి, యందలి క్రీడాసరో వరమునుండివికచ కమల పరిమళములం గొల్లగొని గంధ వాహుఁడువీతెంచ, నాప్రమదవనంబునఁగలవిహంగంబుల య వ్యక్తమధురగానము నాలకించుచు, నవ్యక్తానంద నిమగ్నలై యాప్రమదవన రామణీయత నను భవించుచుండిరి. ఆసమ యంబుననొక్క రాకుమరుండు తురంగంబునెక్కి ధనుర్బాణ

తూణీరధరుండై, యచ్చోటికి వచ్చి యుదాటున నశ్వంబుడిగ్గి తత్సరోవరంబున విమల జలంబుల దప్పిదీర నాస్వాదించి యుల్లంబు చల్లఁగ నల్లనంబోలయుఁ జల్లగాలిని నలఁతదీర్చికొనం దలంచి, కుసుమ కిసలయ శోభిత లతావృతంబగు నొక్కనికుంజాంతరంబునం బ్రవేశించె. అప్పుడు తనయెదురం గొలఁకు దరిని చేటికావృతయై వెలుఁగొందునాయికామణిం గాంచి "ఈ మహారణ్యమధ్యంబున నీరమణీయారామం బెక్కడిది? ఇందీ చెలువ చెలువుండాను నిట్లుండ నేల?మర్త్యచంచ లేక్షణాలం దిట్టి చటుల ప్రభాతరళంబగు తటిల్లత జనింపఁగలదె? ఇది మయునాశ్రమం బని తోఁచెడిని. ఇం దెన్నియో మారులు మృగయాపరిశ్రాంతుండనై వచ్చి విశ్రమించియుండుదు. ఎన్నఁడు నీయింతిం గనుఁగొన్నవాఁడఁ గా" నని తలపోయుచుండె. చంద్రమతియు నయ్యవనీపతి నట్టెచూచి "ఈచెలువుం డెక్కడివాఁడొ? ఇంద్రునిపట్టియొ? చుక్కలఱేఁడొ? తెలియరాదు. కాదేని త్రిశంకుని నందనుం డాకారవిజిత నళినాస్త్రుం డని విందు. అతఁడేనో?" యని ప్రూచినపొన్నగున్న మఱుంగుం జేరి యొకచేటికం జీరి, "అతం డేకులంబువాఁడొ? ఇందుల కేల వచ్చెనొ? తెలియరా" దన నాచేడెయు రాకొమారుం జేరి "ఓరాజకుమార శేఖరా! మీరెవ్వరు? మీయూరెయ్యది? పేరెద్ది? ఇందులకు రాఁ గారణం బేమి? ఇది ప్రమదావనంబు, మగవారి రాకకుం దగినది కాదు. కావున నడిగెద" ననియె. ఆతండును జిఱునగవు నెమ్మొగంబునకు వెన్నెవెట్ట, "లలనా! మాయునికిపట్టయోధ్యాపట్టణము. నేఁద్రిశంకుపట్టిని. నాపేరు హరిశ్చంద్రుండు. మృగయావ్యాసక్తచిత్తుండనై దుర్గమా

రణ్యంబులం జరించుచు మార్గవశంబున నిటవచ్చితి. డప్పి పెంపున నమృతోపమంబులగు నీకొలనిలోని విమలజలంబులం గ్రోలి యీతరుచ్ఛాయం బడలికవాయ విశ్రమించితి'' నని. ఇట్లాచేటిక యాతనివృత్తాంతం బెఱింగి "రాజేంద్రా! ఆ చంద్రానన మాయేలికసాని. జ్యోతిష్మంతుండను భూకాంతుని కూంతురు. దయామయుండగు మయమహాముని కనికరంబు మీఁరఁ బెనుప నిటఁ బెరుగుచున్నయది. ఆమెపేరు చంద్రమతి'' యని చంద్రమతివృత్తాంతంబు నాతని కెఱుకపఱిచి, చంద్రమతికడకుం జని యాతని యుదంతం బెఱుకపఱిచె. చంద్రమతియు "నిప్పుడిది యింటం గూడిన మానిక్యము య్యెఁగదా!'' యనుకొనుచు, వ్రీడాననయై, యంగనామణు లనుసరింప గ్రక్కున గిరుక్కున మళ్లి కంకణాంగద ఝణఝణత్కారంబు లుల్లసిల్ల నగ్గలంబగు సిగ్గుతమకంబు లిగ్గులాడ నంచలంచల నించించుక తిరిగితిరిగి చూచుచు, విచ్చుమొగ్గకు బరిమళించుట స్వభావము కావునఁ దన స్వభావజనిత విలాస చేష్టలం జూపుచు, స్ఫటిక సోపాన ఘటిత శోభిత సౌధంబెక్కి యంతఃపురంబున కేఁగె. హరిశ్చంద్రుండును తంద్రగొని "ఆహా! ఇది నాతోడం గలిసి మాటాడకున్నను నాపలుకుల కభిముఖయై వీనులొగ్గెడిని. నా మోముననె చూడ్కులు నిగిడించుచున్నది'' యనుకొనుచుండె. ఇంతలోఁ గాంతారంబునఁ జెదరిపోయిన సైనికులు వచ్చి తమయేలికం జేరి భేరీ మృదంగాది వాద్యంబులం జెలంగించిరి. అందుల కఁదలి మునిబృందంబులు తందరగొని నదీతటిని తపముసలిపెడి మయుం జేరి, "దయామయా! ఈ మహారావంబునకుం

గారణం బారసి మా యారాటం బుడుపవే!'' యని యడిగిరి. మయుండును దన దివ్యదృష్టి నంతయు నెఱింగి ''ఇది యిక్ష్వాకుకుల కలశోదధి చంద్రుం డగుహరిశ్చంద్రుని రాకనైన క్రందు. ఇందులకై కొంచ లింపం బనిలే''దని వార ల జడుపు నుడిపి, తపముం జాలించి, శిష్యగణము తన వెంటరా నమ్మనుజేంద్రుండు విడిసియున్న యెడ కేఁగి, తన్ను దవ్వులంగని యెదుర్కొని చనుదెంచి తనకుఁ మ్రొక్కిన రాజుం దీవించి, యతిథి సత్కారంబులం గారవించి ''రాజపుంగవా! మీ జనకునియనంతరము ధరాధ్యక్షుండ వైతివని వింటి. నీ సుగుణ కీర్తిచంద్రికలు చుట్టును వెలుంగం గంటి. నాఁటనుండి నిన్నుఁ జూడవలెనన్న ప్రియం బెదఁ గొంటి. అయ్యది దైవి కంబుగ నేఁటికాలంబున కొనఁగూడఁగంటి. నీబోఁటి మేటి రాజున కాతిథ్యం బీఁగంటి. నాకొఱంత లెల్ల నీఁగఁ గంటి'' ననియె. అయ్యుర్వీశుండును, ''మునీశ్వరా! సర్వజ్ఞులరగు మీ పదద్వయముం గన్న యజ్ఞులకేనియుఁ గొఱంతలు లేవన, మీకృపామహిమ గలిగిన మాయట్టివారికిఁ గొఱంతగొఱంత యేని కలుగునే? మీకరుణకుం బాత్రంబైతిఁ గానఁ జేసేత నందులకుఁ దగిన మేలందఁ గాంతునని తలంచెద'' ననియె.

అంత నమ్మునిచంద్రుండును రాజచంద్రునింగాంచి నవ్వుచు ''మీవచ్చిన కార్యసరణి ననుమానింపక తెలుపుఁ'' డనియె. నృపుండును దనయమాత్యుండగు సత్యకీర్తిం గనుఁ గొలిపి చంద్రమతియెడం దనకు వలపుకలిమిం దెలుపుమన నమ్మంత్రిసత్తముం డమ్ముని సత్తమునికిఁ గృతాంజలియై, ''మునివరా! మాయేలిక మీబాలికం దనయేలికసానిం జేసి

కొనవలపుఁగొని యున్నవాఁ"డని తెలుప, నత్తపసియు నమ్మునవిం జెవులార నాలకించి మించిన సంతసం బంతరంగం బున దొంతరలాడ "ఇది కోసలేశుని కుమారిక. ఒకనిమిత్త మున మముంజేర దీనిం బ్రేమంబునఁ బెంచుచున్నాఁడను. ఇ మ్మిహిరకుల పవిత్రునకుం గళత్రంబుగా నమ్మానవేతి తొలి పుట్టువునం దెట్టినోములు నోచెనో?" యని "సత్యకీర్తీ! ఈ చక్రవర్తికి నాకుమార్తం గైకొన ననుమానంబేల? జేలయు దీని కొడఁబడకపోఁడు. మీాఱేఁడు నేఁడు నెల్లి నిందునిలిచిమా కల్లుఁడై చనందగు" నని తన తపస్సామర్థ్యబు పెంపునఁ బరి ణయంబునకువలయు సంభారంబుల నప్పుడ యొడఁగూర్చనియ మించి, తన యాశ్రమవాసులగు తాపసుల నందఱం గుమి గూర్చి వారలయనుమతి వడసి మఱునాఁడె యతివైభవంబున వారలకు వివాహంబుఁ గావించె. మఱియుందు నల్లుని కొలంది యరసి కట్నంబులఁ గానిక నిచ్చి "సార్వభౌమా! నాదగు తపశ్శక్తింజేసి యొక్క శక్తిని నొక్క చంద్రహాసంబుం గావించితి. అందుశక్తిని దశకంధరునకు నాజ్యేష్ఠపుత్రియగు మండోదరి నిచ్చుచో నిచ్చితి. ఇప్పు డీకూఁతు నీకిచ్చితిం గాన సర్వశత్రు నిరాసభాసురంబగు నీ చంద్రహాసంబు నీ కిచ్చెద. దీనిం జేఁబట్టి చరియింతువేని నిన్నెట్టిశూరుం డేని చెనక వెఱచు" నని నుడివె. హరిశ్చంద్రుఁడును సతీయుతుం డై యత్యంత భక్తివినయ పురస్సరంబుగ మఱునియనుమతి వడసి వెడలుటయుఁ, జంద్రమతి కన్నవారొల్లనితన్ను మన్నన మెయిం బెంచి సకలైశ్వర్య సంపన్నం జేసిన మఱు నెడఁ బాసి రా మనసురాక మొగంబు విన్నదనంబున కాకరంబుగఁ

గన్నుల నీరు దేరంగని మయుండును డెందంబు గొందలం బందఁ గుంది కొంతవడికిఁ దెలివొంది "నీకుఁ జింతిల్ల నేల? పుట్టువునుం దొట్టిన కీడులెల్ల నూడుకొనియె. సర్వ సర్వం సహాధ్యక్షుని నిక్ష్వాకుతిలకుం జేఁబట్టితివి. ఇలంగల రాణి వాసంబులెల్ల నీకు దాసురాండ్రుగాఁ గడు నడరు సిరుల నిర వొందుము. తొల్లింటి జోస్యులమాటలు నేటుకువచ్చి యాపద లాపాదిల్లునేని నాదగు నాశీర్వాదబలంబునం జేసి సూర్యో దయంబున నంధకార పటలంబునుం బోలె నచిరకాలంబునం బటాపంచలై పోయెడును. నీవును నీమనోహరుండును న య్యిందిరా మందరధరుల యందంబున నెల్లకలుములకునిలై మారునింబోలు కుమారు నతిసుకుమారుఁ బడసి కీర్తినీయులై వర్తింతురు. నే నెడపదడప మీపట్టణంబునకు వచ్చి నీసేమం బారయుచుండెద" నని యాఅడంబలికి ప్రియపూర్వకంబుగ ననిచిపుచ్చెను. కొంతకాలంబు పెంచిన తపోధనులే యిటు కుందుదురేని తమంతఁగను కూఁతులం బాయు గేస్తులెంతగాఁ గుందుదురో! హరిశ్చంద్రుఁడును నయోధ్యకేఁగి యంతః పురంబుఁ బ్రవేశించి చంద్రమతీసతీలలామం గలసి సుఖం బుండె. అంతఁ గొన్నిదినంబులకు వంశవర్ధనుండగు లోహి తాస్యుఁడను కుమారరత్నంబునుఁ గాంచి ప్రకృతి జనంబుల మనంబులలర నహితభయంకరుండై, హితజనానంద కరుండై, గభీరహృదయుండై, మధురభాషణుండై, సత్యభాషణ దీక్షా కరుండై, శాంత తేజోవిరాజితుండై, ప్రభు మంత్రోత్సాహ శక్తిత్రయ విరాజమానుండై, రాజనీతినిపుణుండై, రాజ్య తంత్ర నిర్వహణ కుశలుండై, పరేంగితజ్ఞాన ధురీణుండై,

సమయజ్ఞుండై, కాసంతయేనియు వీసరపోవకుండ ధర్మమున నడుచుచుఁ బ్రజాపాలనంబు సేయుచుండె.

తత్కాలంబున కొండొకనాఁడు పాకశాసనుండు నాకంబున సుధర్మాసనం బధిష్ఠించి పేరోలగంబుననుండి నితాంత సంతోషాబ్ధిమగ్నుఁడై, వసిష్ఠవిశ్వామిత్రాది తపోధనవ్రాతంబులఁ గూడి, వారల నుచితసత్కారంబులం గావించుచు, వినోదగోష్ఠిం దగిలియుండి ప్రసంగవశమున నమ్మహామునులం జూచి, "మానులారా! మీరలు త్రిలోకసంచారులరు. స్వర్గమర్త్య పాతాళంబుల నెందును మీరెఱుంగని రహస్యములు గానరావు. మీరు గాంచనిన్నృపు లుండరు. కావున నట్టిధరణీశులం దెందేని యెప్పుడేనియు నాడితప్పని ఱేనిం గనియుందురేని నా కెఱింగింపుఁ" డని ప్రార్థించె. అప్పుడువారొకరిమోమొకరు చూచుకొనుచు నొకరినొకరు గనుసన్నఁ జేయుచు బ్రక్కన నుండువారిని గ్రోకుచుండు వారును, గ్రిందఁ జూచుచు నేలవ్రాయువారును, మీఁదజూచుచు నాలోచించు వారును, "నీవుత్తరంబిమ్ము" అని తలయెగుర వేయు వారునై, ప్రతివాక్య నిర్ణయంబుఁ గానక నీళ్లు నములువారునై నోళ్లు మెదల్పక మూఁగల పగిది కలకలం బడుచుండిరి. అంత మునికులవరిష్ఠుండగు వసిష్ఠుండు వారు గుజగుజలాడఁగని ముందుకు జరిగి చివాలున లేచి సభవారి గజిబిజి వారించి "సురేంద్రా! ఆకర్ణింపుము. కలదుగదా యయోధ్య యనెడి పురవరంబు. అందగణ్యపుణ్యుండును త్రిలోకగణ్యుండును, నర్థిరత్నాకల్పక సముండును, షట్చక్రవర్తులలోన మున్నెన్నఁదగు వాఁడును దన యవార్య శౌర్యముచే సప్తద్వీపములం జయించి రాజా

ధిరాజయి యవక్ర విక్రమంబున భూచక్రంబెల్లనేకచ్ఛత్రముగ నేలువాఁడును భానువంశ శరధి చంద్రుండగు హరిశ్చంద్రాభిధానుండును, నగుధాత్రీకాంతుండు నీయడిగిన చందంబువాఁడు. అతం డొక్కరుండ యీరేడు జగంబుల నెట్టి యిక్కట్టులనైన నాడితప్పని సూనృత వ్రతభాసురుండు. తుద కాటలయందేని బొంకెఱుఁగని పరమసత్య నిరతుఁ''డని నుడివె. గాధినందనుండును, ''ఆహా! మాక్షత్రియ వర్ణంబున వర్ణనీయుండైనయట్టి సత్యశీలుఁడు గలఁడని యింద్రసభలో వర్ణించుటచే నేఁగ్రుద్ధుండ నైతి. అట్టి సత్యవ్రతాచరణ పరాయణులు మాక్షత్రియ కులంబునం గాక మఱియెందుండుగు? నేను బ్రహ్మర్షి యై నను తొంటికులాభిమానము నన్నిప్పటికిని విడువకున్నది కదా! ఈచక్రవర్తికతన మా వంగసము వన్నెకెక్కెను. అయినను బ్రహ్మవిద్యాధురంధరులమైన మే మిందఱ మిక్కడనుండ మమ్మెవ్వరినిఁగాని లక్ష్యముచేయక యీతండు స్వతంత్రించి మే మందఱమును చేతగానివార మైనట్లు తా నొక మొనగాఁడై ముందునిలిచి పలికిన యవమానము నామనస్సున నొకమూల వేధించుచున్నది. ఈతండు నోరుమెదలించినంతనె యీజన్నిగట్టుఁ దపసులెల్లఱును బట్టులవడువున నీతనిశ్లాఘించు చుందురు. అందున నాహృదయమునఁ జిచ్చిడినట్లున్నది. ఇదియ కారణముగ నీతనితోఁ జీరిపోరాటము వెట్టికొని యాతని కేభంగినైన గర్వభంగముఁ గావించెదఁగాక'' యనుకొని యందులకొడంబడక క్రోధాత్ముండై వసిష్ఠుం గోపముదర నిరీక్షించి మిట్టిపడి లేచి నిష్ఠురోక్తుల వసిష్ఠా! అఖర్వ రాజ్య దుర్వార

గర్వపర్వతాధిరూఢుఁడై కన్నుగాన కున్న యీహరిశ్చంద్రుం
డు సత్యసంధుండని యనుపమాన తపోగరిష్ఠులగు నీపరాశ
రాది మునిశ్రేష్ఠులకుఁ దలవంపులగునట్లు, విరించిందిరస్కరించి
వర్తించు ననుంజూచియేని శంకింపక నీవునొక మొనగాఁడవై
వినంగాని వెడవెడ బింకంబులు జంకులేక పొంకించుచున్నావు.
ఇట్టివి విన్నవారు నగుదురన్న శంకయైన వలదా? భువి నిట్టి
వింతగలదా? ఉగ్గుపాలనుండియుఁ బరవంచనంబె కులవిద్యగా
నభ్యసించుచు ఘృతపయోదధియుతశాల్యోదన మాంసభోజ
నంబులం గుత్తుకబంటిగ మెసవి క్రొవ్వి కల్లలపుట్టినిండ్లయి
వెలయుభూవల్లభు లేడ? సత్యసల్లాపంబు లేడ? నిక్కముగ
ధరణీపతు లెక్కడ? సత్యవ్రతంబు లెక్కడ? ఆహాహా! నక్క
కు నిర్జరలోకంబు సంభవించునట్లున్నది. భానువంశజులకుఁ
బరంపరగఁ బురోహితుఁడవై పొట్టవోసికొను కతన నీకాతని
పై నభిమానము. వెనుకముం దఱయక యిట్టితపోధనులు
నిండియుండు నీసభామధ్యంబునఁ ద్రిలోకములఁ దనయాజ్ఞచేత
నిడికొని సహస్రలోచనముల సకలవిషయములం గోచరంబుఁ
జేసికొనఁగూడిన యీదేవేంద్రునియెదుర నక్కఱ మాలిన
పెద్దఱికము పైవేసికొని యిట్టికల్లలగు ప్రల్లదంబు లాడ నీ
పుట్టియేమి మునిఁగె? నీనోసటనే ప్రొద్దు వొడిచెనా? సార
మారయు నేరిమిం బేరిమింగన్న యీపురందరునియెదుర
నీమాటకారితన మెట్లుపాటి కెక్కు? ఎక్కనుపో, నీనిక్క
లడఁగ ద్రొక్కక కౌశికుం డూరకపోవిడుచునే?'' యనియె.
నావుడుఁ దాపసవరిష్ఠుండగు వసిష్ఠుండు విశ్వామిత్రుని కలుక
జనియింపఁ జూచి, యాపరానికోపంబు దీపింప ''ఓరి! చెడుగా!

నీరాచచిన్నె లిటఁజెల్లు ననుకొనెదవు కాఁబోలు! ఆత్మస్తుతి యుఁ బరనిందయు దుర్జనలక్షణంబు లని యెఱిఁగియు నిట్టి దుర్నీతులు వదరెడి నీతపం బేల కాల్పనే? పలువురు తెలివరు లున్నచోట నాకసంపన్నునిం బేరుకొంట పాడికాదంటివి. ఎట్టి యెడనేని యున్నదున్నట్టు చెప్పుట తప్పుగాదు. దివాంధంబుల తోడ నీరక్షీరవిభాగ నిపుణంబులగు రాయంచలం బురుడింప నగునే? మోహాంధులగు క్షత్రియులతోడ సూనృతవ్రతా చరణ సౌశీల్యంబులం బేరెన్నికంగన్న హరిశ్చంద్రనరేంద్రుం బోల్చుట యురగకంకణుతోడ నూరజోగులను సరిచేసిన చందంబగును. సభయందు ధర్మసందేహంబడిగిన యార్యుల ప్రశ్నమున కుత్తరంబు దెలిసియుండియు నుచితభంగి నెఱుం గఁజేయకున్న నరకప్రాప్తి యగు ననెడిధర్మశాస్త్ర విధుల నెఱుఁగవు కాఁబోలు? పైత్యరోగికిఁ బంచదారయుఁ జేదగు నట్లు నిర్నిమిత్తవిద్వేష వివశుఁడవగు నీకు నా సముత్తరంబు తప్పిదంబు కాకమానదు. నిత్యసౌశీల్యంబుల ముజ్జగంబుల కొజ్జయగువాని వాస్తవధర్మమును నేను వక్కాణింపనాతోడఁ గయ్యంబునకుఁ గాలు ద్రవ్వెదవా? ఆతనిసత్యవ్రత సుధా రసంబు నీ కొక్కనికిమాత్రము విసం బయ్యెనేమి? ఆమహేం ద్రునఱకాలివ్రా లఖిలభూపాలుర ఫాలభాగంబుల నుండునే? హనుమంతుని మ్రోలఁ గుప్పిగంతు లన్నట్లు నీబుద్ధి మాలిన సుద్దులు నాసన్నిధిని సాఁగిరావు కట్టిపెట్టుము. జాతిప్రతిమకు చక్కిలిగింతలా? కొంచక మించి యాతనినిందించిన మాత్రన నాతనిసత్యమహిమ కొంచె మగునే?’’ ఇఁక నిట్టివిమాని మానిత వర్తనంబున మెలంగం దలకొనుము’’ అనినుడివె.

అంత విశ్వామిత్రుఁడు "వసిష్ఠా! కల్లపగ్గియలం బ్రక
టించుచు నృపాధముఁ బెద్దజేసి యీసభను నుతియింపకుము.
నీకాఱుకూఁత లాఱేనికడఁ గూసిన నీపొట్ట నిండెడిని. న
న్నెవ్వనిగాఁ దలంచితివి? నన్నింతలోనె మఱపొందితే? తొల్లి
పంతమువచ్చినంత నీ సుతశతము నంతకుమందిరమునకుం
బంపిన యలగాధిసుతుఁడఁజుమ్ము. దేవేంద్రుం డిక్కడ నుండు
వారి నందఱనడిగెఁ గాని నిన్నొక్కనిమాత్రము బొట్టును
గాటుకయుఁ బెట్టి పేరంటమునకుఁ బిలిచెనే? ఇందఱకుఁ
దెలియని విషయము నీకొక్కనికి మాత్ర మెట్లు తెలియును?
సృష్టికిఁ బ్రతిసృష్టిఁజేసి ఫాలాక్షునంతవానిలోఁ గొన్నాతపం
బునె కాల్తువే? నాకన్న నీవెందుఁ బెద్దవో? నీసుద్దులం గట్టి
పెట్టు" మనుడు, వసిష్ఠుఁడు, "పంకజగంధంబుపుష్పంధయం
బునకుంగాక భేకంబున కెఱుకపడునే? సత్యవ్రతాత్ములసత్యత
సారగ్రాహులకుఁగాక నీయట్టివార లెఱుంగంబోలు నెట్లు?
ఓసభాసదులారా! ఆత్మస్తుతియుఁ బరనిందయు ననర్థంబులే
యైన నిప్పుడీబాలిశునిమూలమున నన్ను నే నించుక చెప్ప
కొనవలసివచ్చె. తపశ్శక్తియందలిమాయుభయుల తారతమ్య
ములను మీరందఱు నెఱుంగఁ బూర్వమావిరించియె నిర్ధార
ణము చేసియున్నాఁడు. ఓరి విశ్వామిత్రా! నిన్ను బ్రహ్మ
ర్షినిఁ జేయుటకై సాక్ష్యంబుకొఱకు నాచేఁ బిల్వఁబడినకర్మ
సాక్షి, యాదిశేషుండు. కలశభవుండు నెఱిఁగియుండ, వారిజ
గర్భుం డేనెందు నధికుండనో మనతపశ్శక్తి తారతమ్యంబులఁ
దీరుమానించిన దంతలోనే మఱచితివా? కృతఘ్నుఁడా! హరి
శ్చంద్రుని తను వెల్ల సత్యంబ. ప్రియంబుదక్క నీవొక్కటి

యన నేనొక్కటియన నిట్టి వట్టిమాటలం జాలిఁబెట్టనేల? నే నొక్కటిజెప్పెదవినుము. కప్పురము పుట్టుకతోడనే పరిమళము తోఁగూడి యొప్పుచొప్పున నాతండు జనించినయప్పుడె సత్యవ్రతంబును నంకురంబయ్యె. పుట్టిననాఁటనుండి యావిభునితల్లి నిత్యసత్యవ్రతంబును వెన్నతోనిడి పెంచెను. దాని విడఁజేయ నీచేతఁగాదు. వారిజగర్భబ్రాఁత దప్పినను, తపనుఁడపరశిఖరి నుదయించినను, మేరువు గ్రుంగినను, మిన్ను వ్రాలినను, ధారుణీచక్రంబు దలక్రిందుగఁ బడినను, వారిధు లింకినను, వీతిహోత్రుండు శీతలభావంబు నొందినను, నారాజపురందరుండు మాటఁ దప్పఁడు. తుదకుఁ గలనైన మఱపుననైనఁ బరిహాసమునకైన ననృతమాడఁడు. ఆమానవేశ్వరుండు సర్వైశ్వర్యంబులతోడ భార్యాపుత్త్రులనైనఁ బరిత్యజించుఁగాని సత్యపరిత్యాగంబు సేయనేరఁడు. దీనిం గట్టిగ నమ్ముము. నేఁ బట్టినకుం దేటికి మూఁడుకాళ్లేయనిపట్టు పట్టెడి నిను లెక్కం గొననేల! ఏనుఁగుపల్లు పట్టిచూచినవిధంబున సన్నేల చెనకెదవు? సామజరాజమును దోమమార్కొనఁ నేర్చునే? కొండను ఢీకొనిన మేషము బ్రతుకునా? నాతోఁ బ్రతిఘటించుట చి చ్చొచ్చెడిఁ గట్టు న ట్టని తెలియవైతివే? రాజమార్గమునఁ బోయెడిగంధసింధురమును జూచి కుక్క లెన్ని మొఱఁగ'' వని యూరకుండె. ఇంద్రుండును ''అంతకంతకుఁ గోపంబులు రూపంబులు దాల్చినయట్ల రౌద్రమూర్తులై మత్సరంబు హెచ్చఁ గోపావేశముచే దేహములం దెలియక బలిసి క్రొవ్వియున్న యాఁబోఁతులవలె అంకెలువేయుచు నొకరిమీఁదనొకరు దుముకుచుఁ గయ్యంబునకుఁ గాలుద్రవ్వుచున్నారు. వీరిం బ్రశాంతింపనైతి

గాక యున్నది" అనుకొనుచుండెను. ఇంతలో గాధపట్టియుఁ జండకోపనుండై మండిపడుచు "నీమాట పట్టే నెటుఁగెద. వృథాకలహముతోఁ బని లేదు. వానిసత్యం బేనరసెదఁగాక! వానినెట్టులైన బట్టుపట్టి, కపటంబులం జుట్టి, ధైర్యంబుఁ బోఁగొట్టి యెట్టులైన వలసినన్ని బొంకు లాడించినఁ బన్నిదం బేమి చెప్పుమా?" యనియె. వసిష్ఠుండును, "ఆనరనాథుఁడు మనోవాక్కాయకర్మంబులనైన బొంకు నేని, పలుమఱు నీవు నన్నుఁ బరిహసింప, నావిప్రత్వమునకుఁదొలంగి, యుపవీతంబుఁ ద్రెంచివైచి, జపసంధ్యాది సత్క్రియ లుడిగి, శిరోముండనంబుఁ గావించుకొని, నారచీరలు కట్టు టుడిగి, సురాపూరిత నర కపాలంబు కేలంగ్రాల, ఖరవాహనం బెక్కి దక్షిణాభిముఖుండనై చనువాఁడ"ననియె. అంతఁ గౌశికుఁడు క్రోధవివశుఁడై, నాసికాపుటములదరఁ బురందరాది బృందారకబృందంబులును తాపసజనసందోహంబులును వినఁ బ్రచండరవంబున "నాతనిఁ జలపట్టిబొంకింపనేరనైతి నేని, హిమాద్రిని వాయుజలాహారినగుచుఁ జంద్రశేఖరుంగూర్చి తపంబొనర్చిన ఫలంబున సగం బానగధీరునకుఁ బంచి యిచ్చి, చతుర్దశ మహాయుగము లవనిం బూజ్య సామ్రాజ్యవిభవంబులం బొందించి, యీత్రిదివమునఁ బదునాల్గు మన్వంతరములదాఁక సుధర్మాసనంబున నర్థాంశంబొసంగువాఁడ"నని ప్రతినసలిపె. అంత నిర్జరవల్లభుండు కొలువుఁ జాలించి వీడుకొనియె. తక్కుంగలవారలెల్ల "నీనెపంబుననైన హరిశ్చంద్రు సత్యవ్రతముం గనంగలిగెంగదా"యని తలపోయుచు నిజనివాసంబులకుం జనిరి.

వసిష్ఠుండును "సెబాసురా కౌశికమునీ! నీబాస మెచ్చవచ్చు. మఱేమియుం దుడుకువడి నుడువక త్రిశంకుపట్టి నింద్రునర్ధాసనంబున నిలుపుదు నంటివి" యని యుల్లాసంబున నల్లన నిలకుడిగ్గె. విశ్వామిత్రుండును "నేను భూతలంబున కేఁగి నానేరుపుం జేసి పెక్కుమాయలుపన్ని వాని యుక్కడంచి మోమోటమి లేక వానిధనమెల్ల కొల్లలాడి వానిం బదభ్రష్టునిఁ గావించి ధృతిదూల నింటింటఁ దిరియంజేసి నాపూన్కి సివ్వటిల్లఁ గల్లలాడింతు" ననుచుఁ దనయాశ్రమంబుఁ జేరె. ఇంతలోఁ జైత్రంబాసన్నంబగుడు హరిశ్చంద్రుం డొక్క క్రతువొనరించి విప్రతతికి భూరిదానంబు లొసంగుచుండెను. ఆ యుదంతంబుఁ గౌశికుం డెఱింగి, "నేఁ గడఁగినపని కిదియదను. నేనాతనికడ కేఁగి ప్రియంబున నాశీర్వచనములొసఁగి ప్రీతిపుట్టించి యజ్ఞంబు పేరు చెప్పి యగణితంబగుధనరాశి వేఁడి యాతనిమదిలోని ధృతిఁగలఁచి బొంకింతు" నని కృతనిశ్చయుండై యయోధ్య కరిగి మేదినీవిభుం గాంచి యాతనివలన నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజలంది, యర్ధాసనాసీనుండై బద్ధాంజలిపుటుండగు నాతని దీవించె. హరిశ్చంద్రుండును, "మౌని వర్యా! మీయాగమనంబునం జేసి నాయాగంబు సార్థకంబయ్యె. నేఁగృతార్థుండనైతి. నాయాగఫలంబునుఁ గాంచితి. బ్రహ్మతోసహమించి, ప్రాభవంబునమించి, బ్రహ్మకుఁబ్రతిసృష్టిచేసి బ్రహ్మీభవించి విమలకీర్తిం గాంచిన వేదమూర్తులు ననుధన్యునిఁ జేయఁగోరి వేంచేసితిరి. సకల పుణ్యసంపదలం గాంచితి. రాజకోటిలో మించి వాసికెక్కితి. మీవాంఛితం బెయ్యది వేఁడుఁ డిచ్చెద" ననిన విశ్వంధరాకళత్రునకు

విశ్వామిత్రుండు, "హరిశ్చంద్రా! నీ యజ్ఞవైభవంబంతయు వేనోళ్లఁబొగడఁబడుచున్నది. అప్పటి దానధారా ప్రవాహంబు లెందును బాఱెను. నేను తడవులంబట్టి తలపెట్టుకొన్న యొక్క కడిఁదిపని దడవి నీయెడకు వచ్చితి. చంద్రమౌళికిఁ బ్రీతిగ నొక క్రతువు సలుపఁగడఁగితి. నీవందుల కెడలేక యనుమతించి యద్దాని సాంగముగ నీడేర్పవలయు. బలవంతుండొక్కఁ డేనికపై నెక్కి నిక్కినిలిచి రతనంబొక్కటి మింటికెగ మీటిన నెంతదవ్వరుగునో యంతపాడవు వరాలకుప్పనిత్తువేని యధ్వరంబు యథావిధిగ నెఱవేరు. అన్యులందిడియలభ్యంబగుటజేసి నిన్నాశించితి" ననెను. రాజన్యుం "డతిధన్యుండ నైతి నా గృహంబు పరమపావనంబయ్యె. ఈ సమయంబున మీబోఁటి సంయములకేఁ గాంచు టెంతయు మేలుగాదె? ఇంతకన్న మిన్న యగు పున్నెంబు గలదే? మీవలసిన విత్తంబు చిత్తంబు కొలందిఁ గైకొనుం" డని తన ధనాగారం బాతనియధీనంబు సేయుటయు నమ్మునివరుండు "ఔరా! వదాన్యత. కామిత ఫలదాత వన్న ధరానేతవన్న నీవగాక యీభూతలంబునం దక్కొరుఁడుండునే! నీమనశ్శుద్ధిఁ దెలియవలసి యడిగితిఁ గాక నీవంటి వదాన్యుండు మాకుఁ గలిగియుండ ధనరాసి కేమి కొదువయు నుండదు. దానిని భద్రపఱుప మా కచ్చోఁ గొంపయు గోడియులేదు. నీ విచ్చటనె దాఁచియుంచుము. నా కక్కఱ యొదవినవేళ నీబొక్కసంబున నుండు రొక్కంబుఁ గొనిపోయెద. నీకుం జిరాయు ర్నిరామయంబులయ్యెడు"నని యచ్చోఁ దడయక నిజేచ్ఛంజనియె. అమ్మహీవల్లభుండు "అమ్మునితాఁ గోరినసొమ్ము నిప్పుడకైకొనక యప్పుపైఁ బెట్టి

చనియెడును. విత్తంబిప్పుడ కొంనిచనినఁ జిత్తంబున విచార దూరుఁడ నై యుండఁగలుగుదు. అతండతి క్రోధమతి. ఎట్టి తఱి ధనము వేఁడునో తెలియరాదు. అత్తపసికోపమాప నేరి తర ?'' మని యుల్లంబునఁ బెల్లు వితర్కించుచు నేమియు ననసేరక యూరకపోవనిచ్చి యప్రమత్తవృత్తిం బ్రవర్తిల్లు చుండె.

అట నితాంతకపటక్రియాధౌరేయుం డగునగ్గాధేయుం డమ్మహీకళత్రుబొంకింపననువూహించి యొక్కకపటమతంబు విచారించి, నూతన తనువర్ణంబులు గల కైతవమృగఖగ సత్వంబుల సత్వరగతిఁ గల్పించి, హరిశ్చంద్ర పరిపాలితంబగు దేశంబు గాసివెట్టం బంచెను. అయ్యవి గణనాతీతంబులై, యెక్కడఁ జూచినం దామయై యుక్కునం జెలరేఁగి, పెక్కు తెఱంగుల నత్యంత భీకరకృత్యంబులం జెలంగి, జనపదంబులు సొచ్చి, మడిమట్ల, చేనుచెట్టు, పైరుపచ్చలెల్ల బయలుగా మేసి, గొడ్డుగోద, పిల్ల, మేకలోనుగా సమస్తంబు విధ్వస్తం బుసేసె. దానంజేసి యెల్లప్రజలును గాసిల్లి యుల్లంబులఁ దల్లడంబు పెల్లడర ధరావల్లభుం జేరి మస్తకన్యస్త హస్తులై, “దేవరా! మీావరకృపా విశేషంబున నేఁటిదాఁక పాడిపంటల నావంతయేని కొఱంతఁ గానక బిడ్డలు పాపలు పెంపొదవఁ గూడుఁగుడ్డగలిగి యేచేటును గనక, తల్లిదండ్రులయొద్ది తన యుల గతి మనుచున్నవారము. ఇప్పుడేమి పాపమోగాని జవ సత్వంబులు గల క్రూరసత్వంబులు మేరలేక పుడమి యీనిన కరణిం బెల్లుగ నూళ్లవెంబడిం బడి పైరుపచ్చల కలమాది సస్యంబుల ఫలవృక్షంబుల నన్నింటిని నేపెల్లఁదూలఁగ నాల

మందలఁ గొందలంబందఁజేసి, గృహారామక్షేత్రంబులంజొచ్చి యహోరాత్రంబులు జనంబులం బట్టి మెసఁగఁజొచ్చిన మా మా యిండ్ల మెకల వెఱచి వెసఁ గాపురంబులు విడిచి వచ్చితిమి ఈమృగబాధం బోఁదట్టి మమ్మాదుకొనం జిత్తగింపుఁ" డన, నమ్మానవవల్లభుండు "చింతిల్లకుఁ డెల్లి నేనల్లన మృగవ్రాతంబు నిర్ఘాతంబుసేసి మీగాసియుడిపెద" నని యభయప్రదానం బొసంగి వారల వీడుకొలిపె.

హరిశ్చంద్రభూధవుండు మఱునాఁడు వేకడ నిత్యకృత్యంబులెల్ల నిర్వర్తించి, మృగయావిహారంబునం జనువాఁడై, వేఁట సింగారంబుఁ గావించి సతీసుతులును నమాత్యుండును దోడరా, వాయువేగ మనోవేగంబు లగు హయంబులం బూన్చిన తేరిపై నెక్కి, నానా శకుంతసంతతి ప్రబలనినదమేదురంబై, తరుణ యరుణ కిరణ పరంపరలకుఁ బ్రవేశింపఁ దరంబుగాక, కరంబు సాంద్రం బయి, యిసుకచల్లినం గ్రిందరాలక యిరుల్లు గవియుచుండు వింధ్యవసుంధరాధర పరిసరారణ్యంబుఁ దఱిసి, మృగంబులు మెలంగువ ట్లరసి, యెదురఁ గనంబడినవ్యాఘ్రంబుల శీఘ్రంబ తఱిమి పొడుచుచు, శరభంబుల సరభసంబున డాసి త్రుంచుచు, సింగంబుల భంగంబు నొందించుచుఁ, దన వేఁటనేర్పు మెఱయించుచు, పులుఁగుగములఁ దూలించి, విపినమెల్ల గాలించి, వేఁటచాలించి, పురంబునకుమరలువాఁడై మార్గాన్వేషణంబు సేయుచు దైవవశంబున వసిష్ఠునాశ్రమంబునకుం జని, నిజవదనంబు తదీయచరణారవిందంబులఁ జుంబింప సర్వాంగాలింగిత మహీమండలుండై దండప్రణామంబులాచరించియుండఁగనియమ్మునివల్లభుఁడు

“సప్తాశ్వకులేంద్ర ! స్వా మ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గబలంబు లనెడి సప్తాంగరక్షకుండవై, పాన స్త్రీ మృగయా ద్యూత వాక్పారుష్య దండ పారుష్యార్థదూషణంబులనెడి సప్తవ్యసనంబులుమాని మెలఁగనుర్వైయుండ, భార్యయు నీవును భీకరాతపసమయంబున, నద నరయక మదకరి కిరి లులాయ మృగేంద్ర శరభ ప్రభృతి క్రూర సత్వంబులు చరియింపఁ, గంటకశిలావిశంకట సంకటం బగు, కాఱుకొను ఘోర కాంతారంబునం జరియించుట నీతి యగునే! కాదనక మఱియొక్క బుద్ధి వినుము. మఱచి తప్పననైనను కౌశికమౌని యాశ్రమంబు మెట్టెదవుసుమా! ఆతం డెన్నఁడును బరరంధ్రాన్వేషియుఁ, గుటిలవర్తనుండును, నిష్ఠురచరితుండునై యుండు” నని హితోపదేశంబుఁ జేసి వీడ్కొలిపె. అమ్మహీవల్లభుండును దత్కృతహితంబును మదిం బదిలించి యందుండి కదలి చనువాఁడు, కపటక్రియాకుశలుండగు కుశికసుతుం డా వృత్తాంతం బంతయుఁ దెలిసి, యమ్మహీశునిఁ దనయాశ్రమంబునకు రప్పించు ననువూహించి, యనల్పకపటకౌశలంబున నొక్క మాయా మృగంబును గల్పించిపంచెను. అయ్యేణంబును మిగులఁ బెంప గ్గలింప, మురువును బరువును, మదమును ముదమును బొదలఁ గనుఁగొనువారి కింపులుఘటిల్ల నల్లనల్లన నడయాడుచుండెను. అయ్యిలాపతియు దానిం బొడగాంచి, దానిచిన్నెలు యుల్లంబున నుల్లాసంబుఁ బుట్టింప, లోహితాస్యుం డయ్యేణంబుఁబట్టఁ గడంగంజూచి, లోహితాస్యునకు లీలాకురంగంబుగఁ దెచ్చియిచ్చు తలంపున, నిజపట్టణంబునకుం బట్టుకొనిపోవుటకై తఱుమ, నక్కపటపు

మేకంబు చేయుటలఁతిం జిక్కక, కుప్పించి, చిప్పనదాఁటుచుఁ గొమ్ములచే బయలుచిమ్ముకొనుచుఁ చిక్కువడునదియుంబోలెఁ దట్టువడి నిలిచి, యాస పుట్టించుచుఁ బట్టీక కుప్పించి బిట్టెగసి చిరగొట్టుచుఁ గడుద వ్వేలయించుకొని పోయి విశ్వామిత్రు నాశ్రమంబుపొంతఁ గనుమొఱంగె.

అవ్విశ్వాంభరావల్లభుండును గనుమొఱంగిచనం జూచు దాని తెఱంగెఱింగి రోషంబున నాయిత్రిపసలం బడి వెత్తితనం బున నవ్వనం బెల్లఁ ద్రిమ్మరి, నితాంతనిబిడాతపాక్రాంతుం డును, క్షుత్పిపాసావంతుండు నై, యమందశ్రమంబునుఁ బొంది, శీతలజలాన్వేషణాభిలాషి యై చనిచని, యొక్కచో మృగంబులు కనికరంబునం బాలిచ్చి లాలించుకొదమలచేతను బెబ్బులిశాబకంబు లెదవడ నదనరసి యెర యిడి పొదరిండ్లం జేర్చి యూరార్చు పిడియేనుఁగులచేతను, ఏనుంగుగున్నలం గూడి వేడుకలు మీఱనాటలాడ వేఁడు సింగంబులచేతను, సింగంపుఁగూనలఁ గానలందిదిగి బడలనీక తమదీఁపుల నిడి మోచితెచ్చు దచ్చికాళ్ల మెకంబుల చేతను మనంబునకువెఱ గొనర్చుచు నొప్పారు నయ్యాశ్రమము విశ్వామిత్రమహా మునీంద్రునిదిగా నెఱిఁగి, యందు స్ఫటికదర్పణంబుఁబోలెఁ దన రారుకొలనుఁ గనుంగొని, లలనయుఁ దానును సుతునితో నల్లనఁ దేరు డిగ్గి, సరసిలోఁ జొచ్చి, జలంబులు గ్రోలి, దాని గట్టునఁ గనుపట్టు పుష్పిత మాధవీలతా మంటపాంతరంబునం జంద్రకాంతమణివేదికం గిసలయతల్పంబున జంద్రమతి యూరువు లుపధానంబుగా శయనించి "బహుపుష్పలతా సదనం బుల ముదవొదవించు నియ్యది యేమునియాశ్రమంబొ తెలియ

రా'' దనుకొనుచుండ, నచ్చటి కపుడు కుశసమిత్పర్ణ ఫలం బులం గోయవచ్చియుండిన ఋషికుమారునివలన నది కౌశికు నాశ్రమంబుగా నెఱింగి ముప్పిరిగొన్న భీతితో ''అక్కటా! ఎక్కడి హేమకురంగంబు? ఎక్కడి మృగయా విహారము? ఇక్కడి కేటికివచ్చితి? మిక్కిలి ప్రమాదంబయ్యె. అరుంధతీ నాథుండు నామీఁది వాత్సల్యంబున మఱచి తప్పియేని గాధిసుతునివనముం జొఱ వలద నెను. ఇచ్చోఁ దడయక చెచ్చెరఁ బురి కేఁగుమన నూరికిఁబో నేరక మృగము వెంబడి నే నిటు లేలవచ్చితి? మిగుల మోసంబయ్యె. ఏమిచేయువాఁడ? ఎక్కడి కేఁగుదు? కౌశికుం డప్పర మేశు గర్వంబైన నడంపఁ జాలునన, నే నన నెంత? ఆతం డనుగ్రహించినఁ బితామహు నిగఁ జేయఁగలఁడు. అలుక వహించు నేని నప్పితామహున్నైన నల్పునిగఁ జేయఁజాలు'' నని విచార డోలాందోళిత మాన సుండై యుండ, నమాత్య శేఖరుండగు సత్యకీర్తి తన బుద్ధి క్రియాపాటవంబు తేటపడ వినయాలాపంబుల నిట్లనియె:-''ఓ కమలా ప్తకులాగ్రణీ! మీరీతలపోతలకుం దొడంగద రేల? మీ కింతచింత నొంద నేటికి? సముద్రగాంభీర్యుండవును, నద్రిధీరుం డవును, లోక స్తుత్యసత్య వ్రతండవును నగునీపై నలిగెడువార లుం గల రే? శత్రుమిత్రత్వములు రెండును సమముగఁ జూచుచు నడవుల నొంటిఁ దిరుగుమునులకు నృపులతో మచ్చ రంబేలకలుగు? అదియుఁగాక మీజనకునిఁ గృపతో బొంది తోడ స్వర్గంబున కనిపిన కౌశికు దెస భయ మేటికి?'' అని పలుకు ప్రధానాగ్రగణ్యుని పలుకులాకర్ణించి సంతాపం బుడిగి ముహూర్తమాత్రంబు నిద్రించె.

అపుడు తాను భద్రాసనం బధిష్ఠించి పేరోలగంబుండఁ జండకోపనుం డగు నొక్కతపోధనుండు రోషారుణేక్షుండై యదలించి, యాతనికిరీటంబు ధరణిపయిం బడఁదన్ని, తలవట్టి తిగిచి, కరంబు నిర్దయవృత్తిఁ బురము వెల్వెడఁ ద్రోల,బహువిధాపత్పరంపరలఁ జెంది, యీశ్వరానుగ్రహంబున మరలఁ బూజ్యసామ్రాజ్యవైభవంబునుఁ గన్నట్లు దుస్స్వప్నముం గని, యదరిపడి లేచి కలవరింపఁ దొడంగె. అందులకుఁ జంద్రమతియుఁ దందరఁగొని, యెట్టకేనిం దాలిమిఁ గైకొని "నాథ సి వెన్నఁజఱచి, "కలలోనం గాంచిన యర్థంబులు సత్యంబులగునే? కలలోన నఱుకులాడినఁ గాయంబులమీఁద గాయంబులు గానవచ్చునే? ఈమాత్రమునకె పొలుపఱి భీతిల్ల నగునే? ధరామరుండు మకుటంబును దన్నుట రాజ్యవిభూతిఁ బాయుటయె యగు. తన్నిమిత్తమున బహుప్రయాసములు ప్రాప్తించును." అని మనస్తాపంబుమానిపి యూఱడించుచుండె. ఇంతలో నచ్చట గౌశికుండు మాతంగయానములుగల మాతంగవధూయుగంబును సృష్టించి వారలతో "రాజాస్యలారా! క్షత్రియకులవార్ధిచంద్రుండగు హరిశ్చంద్రునిదర్శించి సంస్తుతించి సంగీతవిద్యా ప్రసంగంబులం బచరించి మీ మృదు మధురోక్తి సంపదలు నెఱపి యాటపాటలఁ దేటమాటల మరిపి మెప్పించి సంతోషస్వాంతుం జేసి యతని నడుగరాని పదార్థంబు లడిగి ధైర్యహీనుంగావించి, బొంకించి రండు" అని చెప్పుటయు, నప్పల్లవాధరలును నమ్మునివల్లభునకుం బ్రణమిల్లి సముల్లాసంబున సంపూర్ణ పూర్ణిమాచంద్రాస్యలై పొక్కుచు సోలుచు నంతంత నిలుఁచుచుఁ జనుదెంచి నృప

వరుండు నివసించు చక్కటిం దరిసియనుపమాన వినయపూర్వ కంబుగ "దేవరా! ఇంతకుముం దప్పుడప్పుడు దేవరకీర్తి వెక్కసంబుగఁజెప్ప వీనుల కింపుగ విని సంతసించుచుంటిమి. నేఁడుమాభాగ్యవశంబునఁ గన్నులపండువుగ మిముంగంటిమి. అవధారు దేవ!" యని సన్నుతించి వీణియలువాయించి తమప్రవీణత మెఱయఁ జూపిరి. ఇవ్విధంబునఁ బాడిన నవ్వాలి వాడచేడియల నిరుపమానగానవిశేషంబులకు బరితోషంబు నొంది, ధరిత్రీవల్లభుండుల్లంబునసంతసిల్లి, "దృష్టి మిఱుమిట్లు గొలుపుచున్న యిమ్మందయానల సుందరాకారములంగన్నను, వీనులకు విందవిందుగొలుపు మృదు మధుర వచోరచనాచమ త్కారములువిన్నను వీరు విహారార్థముగ ధారుణి కవతరించిన లక్ష్మీసరస్వతు లనఁబోలి యున్నవారు. 'గానకళాకౌశలంబుఁ జూపవచ్చిన రంభోర్వసులో ?' యనఁబోలి యున్నవారుగాని మాతంగకాంతలుగ నెంతమాత్రముకానగారు. వీరియసమాన కళావిభ్రమములంజూడ విశ్వామిత్రుఁడే తనతపోమహిమచే వీరలసృజియించి మనలను వంచించుటకై యిటకుఁ బంపి యుండనోవు" నని యించుకసంశయించి వారల కనేకమణి మయాభరణంబులు బ్రియంబెసంగ నొసంగి పొమ్మనుటయు, నమ్మెలఁతలు తమ కాధరణీనాథుని గొడుగుఁ దక్కఁదక్కిన వాని నొల్లక తచ్చనలకుం జొచ్చిరి. త్రిశంకుపట్టియు నాముట్ట రాని పడుచులయాగడంబులకు సయిఁపక, "మెలఁతలారా! సిరిరా మోకా లొడ్డువారును గలరే? ఈరాని వస్తువు నియ్యనే రాదని మీకుఁదెలియదా? మీజాతియెంతయొ బుద్ధియు నంత. మీకొఱమాలినవర్తనంబు లిక్కడసాఁగిరావు. నాదు

గొడుగిమ్మని పలుక నాలుక లెట్లాడెను? మీయపరాధము లిప్పుడు సైచితి. ఇఁక వెడమాటలాడితి రేని మీనాలుకలుతెగింతు” నన నాయువతులు మదిరాపానమదభరాలసలై చిందులు ద్రొక్కుచుఁ, జెలఁగినవ్వుచుఁ, గరతాళగతుల నాడుచుమాన వేంద్రుపయిఁ బడ నుంకించినంగని చేయునది లేక తాళిమిం దొలంగి, మీమదంబుడిపెదఁ జూడుఁడని కొరడా ద్రెబ్బల నాబోటుల నలయించి తఱిమివేసెను. అంత నామాలెత లేడ్చుచు “రాజాధమా! నీ వాఁడుతోఁడునఁ బుట్టవా? యాచ కుల మగు మాబోఁటిపూఁబోఁడుల కరుణమాలి కొట్టింప నీకు మన సెట్లు వచ్చె? ఎందును వీరుఁడు తనశూరత యుద్ధసమయములం దన ప్రత్యర్థిపయిం జూపునుగాదె? మహా బలుఁడు తనశక్తిని మహాభూజంబులపయిం జూపక యడు గంటిన తీఁగెలపయిం జూపునె? ఆఁడువా రుసురసురని క్షోభ పడినఁ దత్ఫలము కట్టికుడువక యూరకపోదు. కీడెంతవార లకైనం గెరలక కలుగును. మమ్ము బిడ్డలవలెఁ జూచుకొను చున్నవిశ్వామిత్రునికి నీమర్యాదంబును నివేదించి నిన్నేమి చేయించెదమో చూడు” మని నుడివి వెడలిపోయిరి.

అప్పుడు చంద్రమతి హృదయేశ్వరుమోముఁ జూచి, “నాథా? ఎన్నఁడైనఁ గనకసారంగంబు లున్నట్లు వింటిమే? ఉండెను పో, ఆయిఱ్ఱిపసలవెంబడి నడియాస నిట కేలయేతెం చితిమి? ఎక్కడిమాలెత లెక్కడియాశ్రమము? వారి కిట్టి చక్కఁదనం బెట్లు సంభవించె? ఇంతయు గాధిపుత్త్రికపట కృత్యంబై తోఁచెడిని. అట వసిష్ఠునిహితోపదేశం బిపుడు తార్కాణం బయ్యెడి” నని పలుకుచుండె.

ఇంతలో నబ్బోటు లచ్చోటుఁ దలంగి చని వాడిన మోములును, వీడినవలువలును, తూలెడు మేనులును, రాగంబు దొఱఁగి వ్రేలెడు పెదవులును, విభ్రమం బెడలిపోలెడి చూపులును, గపోలముల వడసిన కన్నీరును, నెత్తురులం దడిసిన రవికలును, చిక్కొదవి విరిసినజడలును, నాదంబు లెడలిన కంఠంబులును గలిగి కౌశికునడుగులఁబడి గోడుగోడున నేడువం దొడంగిరి. గాధిసుతుఁడు, నది తనయెదకుఁ బరితాపంబు గదురఁ జేయ నదిరిపడి, యత్తెఱవల లేవనెత్తి, తత్తఱంబు వాపి, యలుకమై మిట్టి మీనై పడి, తనవలచేతిజపమాల వసుధపై వైచి, బొమముడిపాటుతోఁ గట్టలుక పెంపునఁ గెంపుగొను కన్నుగవ నిప్పులురుల, నూర్పులఁ బొగలెగయఁ, బొటపొటఁ జెమటఁ మైఁబొడమఁ బుటపుటఁ గటములదరఁ గటకటబడి యాడు గఱచి, యచ్చటిముని ప్రవరులు వడఁక, ప్రచండదండంబు కేలంబూని, రెండపదండధారిగతి దుర్నిరీక్ష్య తేజోయుతుండై యేతెంచుచుండె. అట్టియెడ దేవియుఁ దానును గౌశికుం గని, "ఇమ్మునిచే మనసామ్రాజ్యవిభూతులెల్ల వమ్మగును. మన కిది తప్పదు" అని మృగేంద్రముంగన్న చందంబున నత్యంత భయంబును బొంది యెదురుసని మునిచరణంబులకుఁ బ్రణమిల్లి యెడఁగలుగ నిలిచి, యడఁకువ గడలుకొన నంజలీబద్ధులై యుండిరి. మునినాథుఁడును "ఓరికృతఘ్నుఁడా? నీజనకునికై నాతపస్సు ధారపోసి నూతనస్వర్గంబునిర్మించి సశరీరస్వర్గం బిప్పించిన మేలు నైనఁ దలఁపక యెంతపనిఁ జేసితివిరా? యని దట్టించి, నరనాథునిఁ దక్కొకఁ దలవట్టి తన్ని, కలంగన్నంతవట్టు ననుభూతంబు గావించె. అంత నమ్మానవేంద్రుం

డు మానంబుదిగనాడి యదరక, బెదరక, యాత్మఁదాల్మి వదలక, మహాత్ములకు సహజగుణంబు లగు దూరభీసుతయు నాసన్నధీరతయు వహించి, ''అనఘా? నాదుఘనమణిస్థగిత మకుటంబుసోఁకినీకోమలాంఘ్రిపద్మమ్ములునొచ్చెఁగా! నాయెడ నేమితప్పాదవె చెప్పుమా? దాసునితప్పు దండముతోఁజెల్లు'' ననుచు మునివల్లభు నడుగులంబడి లేవకున్నం గని, ''ఓరీ? మాయావీ! నీమ్రొక్కులును, నక్కతక్కులును జాలింపుము. మాయంగీకారము లేక మాయాశ్రమంబుఁ బ్రవేశించి, మా యాశ్రమ కురంగము నొప్పించుటయగాక, గోరు చుట్టుపై రోఁకటిపో టన్నట్లు శిరీషపుష్పకోమలులగు నాముద్దు కూఁతుల వ్యర్థంబుగఁ బాడించి, కశాఘాతంబుల నొప్పించి తుదకు నాలుకలు గోయుదునంటివి. ఒకపాదతలమన నేల? నిఖిలాంగంబులు నొచ్చె. ఓరితులువ! నీదుష్టచేష్టలచే నాదేహము మండించి, వ్యర్థములగు నీశీతలాలాపము లేల పలికెదవు? నీచందంబుంజూడఁ 'జంకదుడ్డును, శరణార్థియు' ననెడు మాటకు సరివచ్చె. తొల్లి వసుమతీశులు వేఁటలకై విపినభూములకు వచ్చిపోవరె? తమతేజంబుఁ జూపి మదించిన దుష్టజంతువుల రూపు మాపరె? నీయట్లాశ్రమభూములు సొచ్చి సాధుమృగంబులం గూల్చిరే? బంగారువంటి నాయిల్లిం దూలనేసి నన్ను గాసుకుఁ గొనక నాపెంపుఁగూఁతుల గజిబిజిగాఁగ మోదితివి. ఓరిభూపకీటమా! వేరుపురుగవై నీ వెక్కడనుండివచ్చితివిరా? ''అసిమిసంచిలోని దొక్కటి అమ్మెడి దొక్కటి'' యనునట్లు నీచరిత్రంబెల్ల నేఁడె తెలియవచ్చెను. నీవు కపటవర్తనుండవు. నేఁ డిక నాకోలఁది నెఱుఁగుదువుగాక! క్రొవ్వి కొఱవితోఁ

దలఁగోఁకికొంటివి గాదె. కడుపుకూఁటికై యిచ్చకములాడు వసిష్ఠుఁడనుగాను. నీమిట్టిపాటు నేఁడడఁతుఁజూడు'' మనుచుండ భూపాలుఁడు నివ్వెఱపాటున నేమియు వాక్రువ్వ నోరురాక ఱావేల్పుపగిది నుండె. సత్యకీర్తియుః ''జగదీశ! నీ వివ్విధమున జడునియట్లు యుండఁదగునే? నెగులొందినపుడు వగవక, తూలి పోక, తన్నుఁదా మఱవక వెఱవక యోపినంత ప్రియోక్తులఁ గాచుకొనందగు, నటపై దైవగతి'' యని హితోపదేశంబు సేయ, విభుండును మదిలోని దిమ్మపోవిడిచి చేతులుమోడ్చి ''దీనవిధేయా! గాధేయా! కాలకూటవిషాగ్నిని మించెడి మీకోపానలమునకు బ్రహ్మేంద్రాదులు దాళఁజాలరన, మే మేపాటివారము? పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్రమా? తనయుఁడు చేసినతప్పు జనకుఁడు సైరింపవలవదే? నిను శరణంబు వేఁడెద. ''శరణుఁజొచ్చిన యట్టి శత్రువునైనఁ బరికించి కావంగఁ బంతమెయ్యెడల,'' నన్నట్లు శరణన్నమాత్రన శత్రునకైన నభయ మీవలయు? తనను నఱకవచ్చినవానికి సయితము వృక్షము నీడ నియ్యదే? దయామయా! ననునీళ్ల ముంచుము, పాల ముంచుము, నీభారము. నీవమాకుదిక్కు'' అనుచుఁ జాఁగిలిమ్రొక్కి లేవక ప్రార్థింప నెట్టకేలకుఁ బ్రసన్నుండునుం బోలె ''నీదోషంబు నీయంద యుండు. మాకు దీర్ఘరోషంబు కారాదు. బ్రతుకునలతేని నాచిన్నికన్నియలఁ గొట్టినందులకుఁ బ్రాచితంబుగా వారిం జేపట్టు'' మనుటయు నమ్మహీవల్లభుం డుల్లంబునఁ దల్లడిల్లి ''యెల్లవిధంబులఁ గపటకృత్యంబులు గల్పించిఁ నిక్కల్లరితపసి నన్నారక తొలంగిపోవనీయఁడు. నేఁ గాంచిన దుస్స్వప్నఫలంబు మిన్నకఁ దొలంగునే?''

యని కౌశికునింగని "హరిహరీ! ఎంతటిమాటవింటి! సర్వధర్మవిదులగు మీకు ధర్మతత్త్వములన్నియుఁగరతలామలకములై యుండు. మీరే ధర్మవిరుద్ధమగు నీపని చేయుమని నియోగింప నర్హమగునే? తగవుబోఁదోలి నగుబాటగు నీమాలచన వియ్యకొనం దగ వగునే? అల్పసుఖమునకై పాలవంటి కులము మాలగఁజేసి మను టేల? ఇట్టి గొట్టుమాటలం జాలిఁబెట్టుటకన్న నన్ను మట్టువెట్టుటయ మేలు. వలయునన్న నాదగు సామ్రాజ్యంబైన విడుతుఁగాని కులశీలంబులువిడుతునే?" యని యార్తి మెయింబలికె. గాధేయుండును "తథాస్తు, మాకంతియ చాలు. నీవింకఁ దిరుగనాడినఁ జంద్రమౌళియాన, నా కుమారికల వలవక సామ్రాజ్యంబునైనఁ దలఁగుదునంటివి. ధరణీపా! అజీర్ణముకలుగునని యాహారముమాని, పెల్లొదవు నాఁకటనైనఁ గృశింతు ననియెద వేల? సుఖపడ నీకుఁ బ్రాప్తంబు లేదు. నీసర్వరాజ్యంబు నేఁటితో వర్జించి మాకు ధారవోయుము. ఇల నేడుదీవుల నేలెడివేడ్క నాకుఁ గలదు. అది నీకతన సిద్ధించె. ప్రజల కానవాలుగ నీయంగుళిముద్ర నిచ్చి పంపు" మనుడు నవ్విశ్వంభరావల్లభుండు "మునివరా! ఇది మొన్నటిదాఁక మీ రేలినభూమి కాదె? మీకుఁ గ్రమ్మఱఁ బాలనంబొనర్ప వాంఛ జనించెనేని నన్నడుగ నేల? ఈయెల్ల రాజ్యంబునుం గైకొనుఁడు. నాకు నీపంపుఁ గావింపఁ గలుగుట కన్నఁ బ్రశస్తంబగు పుణ్యంబు గలుగునే? నేఁడుగదా నేఁ గృతార్థుండ నైతి" ననియె. అంత నాతక్కరిజడదారియు మందహాసంబు సేయుచు, హరిశ్చంద్రా! నీ యీ నేర్పుమాటలు పెఱచోటంగాని మాముందఱసాఁగిరావు. మీ

రాచయిూవులు నమ్మంజనదు. నీవు సత్యవాక్పరాయణుండవని ముజ్జగంబులయందును వినుచుందును. నీవు దినేంద్రవంశసంభవుండవు. ఆడినమాట తప్పంబోవదవుసుమిా! ఇప్పుడ నాకు నీ సర్వరాజ్యంబు ధారాదత్తంబుసేయు''మని నిర్బంధించెను. అంతఁ జంద్రమతియు "నాథా! మనమీతని యింద్రజాలంబు వలను లోనైతిమి. ఇందుండి తప్పనుపాయంబును గానరాదు. ఏమాటసందున బొంకెసఁగునో తెలియరాదు. ఈతండు పనివడి పనిఁలేని సెరసులు బట్టఁదొడంగెను. మనకు ముం దేలినవా రెల్లఱును గొనిదెడఁడంతైన నేలఁ గొంపోయిరే? ఈనిఖిలోర్వియు నిమ్మునికిదానమిమ్ము'' అనుటయుఁ దేవ భూదేవ మాన్యంబులు దప్ప సప్తద్వీపధరణి యంతయు ధారుణీపతి గాధితనయుహస్తంబున ధారవోసె. అంతఁ గౌశికుం డాహరిశ్చంద్రుం దీవించి, "ఎల్లిప్రొద్దున వచ్చెద'' నని చనియె. ధాత్రీకళత్రుండును కళత్రసహితుండై పురంబున కరిగె.

అంతటఁ గౌశికుండు మఱునాఁడు శిష్యగణంబులు బలిసికొలువ నయోధ్యకుం జనియె. ఱేఁడును బుడమింజాఁగిలి మ్రొక్కి యర్ఘ్యపాద్యాదు లిడి కౌశికుని సామ్రాజ్యసింహాసనాసీనుం గావించి, భృత్యామాత్యప్రజల వేగ రావించి యవ్యృదంతంబంతయుఁ దేటతెల్లంబుగ నెఱిఁగించి, "ఈకౌశికుండు నారాజ్యమున కెల్ల నేలిక. ఈతని చరణంబులు సేవించి యుండుఁడు. నేనుసుతసతీయుతుఁడనై కానలకేఁగెద''నని యె. వార లందఱు నశ్రుపూరితనయనులై తెప్పలనప్పళించుచు వసుధీశు నడుగుదమ్ముల కెరఁగి, "భూవల్లభా! నేఁటి దాఁకఁ దల్లిమఱుంగుబిడ్డలంబోలె మీాపాలఁబడి చల్లగ నెల్ల

చనవులు జెల్ల సుఖింపుచుంటిమి, ఇప్పు డనదలమగు మమ్ము దయమాలి, యీనఁగాచి సక్కలపాలు సేసినట్లుమమ్మిన్నాళ్ల దాఁక నెన్నరాని యక్కటికం బెంచి యిక్కటికివానిబారిం ద్రోసివావ నీ కెట్లు బుద్ధి వొడమె? నిండుపేర్మిం గీరంబులం బెనచి గండుపిల్లివాతం బెట్టువారుగలరె?నిలువనీడయుఁగుడువ ఫలంబులును నెండవానలకుఁబాపునై యుండు వృక్షమును దొలఁగి నిమేషంబేని పక్షులు నిలువఁజాలునే? మీనేల తపసి కీనేల? సామ్రాజ్యవైభవము పోనేల? విపినభూముల కేఁగ నేల! పేరడవులఁ గాయగసురుల నేరి కుడిచి వర్తింపనేల? మిమ్ము విడిచి మే మిందుండనేల ? వియోగదుఃఖం బెట్లు భరింపఁగలము? ఈతం డతికోపి, ఈతని చిత్తవృత్తినెఱిఁగి మేమేరీతిఁ గొలుచువారము? అకారణంబుగ రాజ్యంబంతయు నపహరించి కట్టుబట్టల నట్టడవులకు సాగనంపి, మీయట్టి పరమ సాధువులకే యింతలేసి యపకృతిచేయు నీతఁడు మమ్ము సంరక్షించునని మే మెట్లు నమ్మఁగలము? గోహింసకు వెనుదీయని క్రూరవ్యాఘ్రంబు మేకలను మేపి కాపాడునే ? ఇచ్చినటిమూగ్గున కిట్టిసిరియబ్బె. ఇఁకఁ జెలరేఁగి యెవ్వరి కేమిసేయునో? మాకీ వట్టిభ్రమలు కల్పించి యడియాసలు పెట్టక మమ్ము నీవెంటం గొనిచనుము. మేము బ్రాములం బడఁజాలము. మీవెంటవత్తుము. వలదంటిరేని మీపాదజల జంబులాన చత్తుము'' అనుడు, వారల నుచితరీతి నోడం బఱిచి, యాలుబిడ్డలుం దాను నడవులకు వెడలి సాఁగిపోవు చుండిరి. అంత విశ్వామిత్రుఁ డామిత్రకులపవిత్రుం జీరి ''పోకుముపోకుము. నన్నిటుమోసపుచ్చి నీవెటుఁబోయెదవు?

తొల్లి మఖార్థము దత్తంబయిన యావిత్తంబుఁ జెల్లింపకయ
యల్లన సురుంగం జూచెదవు. అది వివేకమగునే! ఒక
వేళ మఱచితినిపో! నీవు తలఁపింపవలదె? కక్కినకూటి
కాసపడితో? పరవిత్తంబును బాయసంబుగ భుజియింపఁ
జూచితో? ఇది యాడితప్పని దారియగునా? అందును విప్ర
విత్త మపహర్తలం జంపుఁజుమీ. నాసొమ్ము నీకు దక్కిన
దనుకొనకుము. అవని కింతకు రాజనై యున్న నాకుఁ గాక
యీ మకరకుండలహార మంజీర వలయ మకుటాంగదమ్ము
లన్నియు నీకుఁ బూనదగునె? నీదేవిమైనున్న సొమ్ము
లన్నియు మోముజూడక యొలిచి మా కిటుఁదెమ్ము" అని
వానిం దీసికొని "మును మఖార్థంబిచ్చిన యర్థంబు నాఁటికిఁ
గొనిపోవలేక యిల్లడ నీయింటి నిడిపోతినే యావిత్తంబెల్ల
నిప్పింపక యెందుఁ బోయెదవు?" అని పల్కు క్రూరవాక్యం
బుల కులికి, యాత్మ వేదన నొందుచు, "మహాత్మా! సర్వ
స్వము మీక దారవోసి చిల్లిగవ్వనైనం బట్టుకొనిపోక పట్ట
పగలె కట్టుబట్టల నట్టడవుల కేఁగునాపై నింక లేనియప్పులంగట్టి
యన్యాయమున కొడిగట్టి చిక్కులంబెట్టి నన్నాయాసపెట్టిన
నేఁజెల్లింపఁగలనె? మీయడుగులుగొలిచి కృతార్థుండనగుదు
ననియున్న నాయెడం గృపకలిగి బెడదలుచుట్టి యప్పుపయిం
బెట్టకఁ యింత దృప్తిఁబొందుఁడు" అనియె. అంత వాలముం
ద్రొక్క గరంబలిగిబిట్టెగసి చుఱచుఱంజూచు కాలాహిచందం
బున నమ్మౌని నాథుం డమ్మానవనాథుం జూచి, "ఏమీ!
నీకండకొవ్వు! నీవి ట్లన్యాయమున కొడిగట్టుదువని యెఱుఁగ
నైతి. నీమాటలు నేఁటిదాఁక ననృతంబులు పొరయవు. నేఁ

డిదేలొకో బొంకఁ గల్గె? తొల్లింటి ద్రవ్యమునకు సెలవుగ నీ రాజ్యంబు నిచ్చితివే?'' యనియడుగ, మేదినీరమణుం డమ్ముని యభిమతంబెఱింగి, ''మునికులనాధా! ఇప్పుడు మీకొసఁగంగ లేని పరితాపమున నట్లు పల్కితిని గాని, భవద్విత్తము నాతల తాకట్టుపెట్టియైనను నొండుతెఱఁగులేకున్నఁ దెఱవయు నేనును జెఱనుండియైనను ద్రింశద్వారంబుల కిచ్చెద. సంశయింపకుఁడు. అట్లైకున్న మము విక్రయించియైన మీధనంబుఁ గొనుఁ'' డనుడు, ''ఉర్వీశా! నా కొక విచారంబు పొడమె. నీచే నార్జితంబగు విత్తం బనుదినము నన్నపానమ్ములకై నీవు వెచ్చంబుఁజేయుదువేని యెంతయు మోసంబగు. నీవుసేకరించు ధనం బంతయు నెప్పటి దప్పు డీతనిపరంబుగ నిచ్చుచుండు'' మని తన్నుంబోలెఁ గపటక్రియావిచక్షణుఁ డగునక్షత్రకుఁడను శిష్యునిం గదియఁ బిలిచి తదీయకర్ణంబున, ''నీ వీరాజువెనువెంటం దగిలి రేలునుం బగళ్ళునుం బాయక దొరకినధనమెల్లఁ గొనుచు, నాఁకట స్రుక్కించి, యలసట సొక్కించి, వ్యాకులమొందించి, వెతలఁ గుందించి, దిగులుఁ దెప్పించి, మనసు నొప్పించి, తాల్మిదూలించి, దైన్యంబుగీలించి, గాంభీర్యంబు వదలించి, క్రోధంబున నదలించి, దినములు ముప్పదియుఁ దీరునంతకుఁ దరువుండి, కడమ గాకుండ ధనముతె'' మ్మని యుపదేశించి జననాథుం గని, ''నీతోఁ జనుదెంచునీతం డతి సుకుమారమూర్తి, సోమ కోర్వఁగ లేఁడు. ఆఁకలిదప్పులును శ్రమయు, నంగవిపాటనము, నార్తియు, జూర్తియు సోఁకకుండ ననుం గనుంగొనినయట్ల వీనిం గనుంగొనుము. విను మొక మాట. నీవు మాదేశంబున నూరూరఁ దిరిగి పడసిన ధనము

నఁ బోఁకయేని తాకఁగూడ'' దని యెఱుఁగఁజెప్పి పంపెను. ఇలాపతియు మునిపతి నోడఁబడఁ జెప్పి సుతసతీ సహితుఁ డగుచుఁ బురంబు నిర్గమించి యడవికి వెడలె.

అంతఁ గౌశికుండునుదనశిష్యబృందంబున నొక్కఁడుం డగు సుయజ్ఞునియందు రాజ్యభారం బుంచి, యదృశ్యుఁడై ధారుణీశ్వరు వెనువెంటఁ దగిలి చనుచు, నతం డరుగు తెరువు నఁ బాదంబులఁ బొనుప ననువుపడక ముండ్లకంపలఁ బెంపారు గడుసుదారులు గలిగి మనంబునకు వెఱపుగొలుపు నరణ్యాంబులఁబుట్టలగుట్టలం బొదలునీరఘట్టంబులం బెక్కులుగల్పించి, యుష్ణకిరణుం దీవ్రాతపంబుఁ గాయునట్లు గట్టడ సేసి, యాకులల్లాడకుండఁ బవనసంచారము మట్టుపఱిచి, వాపీకూప తటాకాదులలోని సలిలంబు లింకిపోఁజేసి, యాఁకట వన్య ఫలంబుల భక్షింపబోయినఁ దిక్తంబు గావించి, తెగుదారుల కేని దిగులు పొదలించు మదశుండాలకోలశార్దూలాది వన్య మృగంబులం గల్పించి, నిర్దయస్వాంతుండై యంతరాయంబు లు బహువిధంబుల నొనరించుచుండెను.

అయ్యవసరంబున నందనునిం జంక నిడుకొని, కాఱడవిం జిక్కువడి స్రుక్కఁ బాలువడి, యాఁకలి దప్పులకు నలసి సొలసి కంటకంబులు పాదంబుల నాట గొంటుపడి కుంటుచుఁ జండ తరంబైన యెండకు బెండువడి తరుషండంబుల నీడల నిలుచుచుఁ జెమ్మటలు గ్రమ్ము దేహమ్ములతోడను ధూళి ధూసరితముఖమ్ములతోడను నత్యంత దీనత్వంబుఁ బ్రకటించు చూపులతోడను నడచి నడచి యలసి, యడుగెత్తలేక,యడు గొక యామడై యరుగుదెంచు చంద్రమతిం గాంచి, "ఆహా!

ప్రాసాద నిశ్రేణు లెక్కఁగలేని యియ్యిందువదన మందిరారామ సీమా సమీపంబులందు సయితము మెట్టంగలేని యీవిద్రుమోష్ఠి నందనునిఁ జంకనిడుకొని ఘనతరాతపంబుచేఁ గందిన మైఁదీఁగయందవిరళఘర్మబిందువులుబొడమ నీభయద కాంతారసీమల నీమొరపనేల నెట్లు నడుచుచున్నదో! నగము లేరీతి నారోహణముసేయుచున్నదో! అక్కటా ఈదళమైన కట్టెండ తాకున దీనిమైఁదీఁగె వాడెను. నానిమిత్తంబునంగాదె దీనికీదుర్దశనిటు వేగవలసె" నని హరిశ్చంద్రుఁ డింతింతనరాని సంతాపంబంతరంగంబున దొంతరలు గొనఁ గొంతవడిఁ గాంతారత్నంబునూరడించుచు, నిజహస్తంబాయమకునూఁతఁగానిచ్చి, నిజభుజాపీఠంబునఁ బుత్త్రకు నిడికొని చనుచుండె. ఇంతలో నక్షత్రకుండును లేనిబడలిక దెచ్చుకొని బిట్టునిట్టూర్పు బుచ్చుచు, మిథ్యాపరిశ్రాంతి నటియించి సోలుచు, గుది ద్రోచినట్లు నేలం జదికలఁ బడి, మహీపాలుం జూచి "మీరు పెండ్లినడకలు నడచుచున్నారదేల? నాకుఁ గ్రిందఁ గాళ్లు కాలుచున్నవి. పయిని నెత్తిమాఁడు మాడుచున్నది. మీరు నాకు గుదికట్టవలెఁ దగులుకొని నాకాలు సాగనీకున్నారు. పదంబులఁ బొక్కులుబ్బె. ఇంక నొక్కయడుగైన నడువనోప. అంగంబులుబొగిలె. ఎముకలునొగిలె. మస్తకము చాలనొచ్చె. పదంబులఁ బొక్కులుబ్బె. కన్నులఁజీఁకట్లు గవిసె. నన్నొకమ్రానినీడం జేర్చి, విమలజలంబుల నెచ్చోటనైనఁ దెచ్చి దాహభరంబుడిపి ప్రాణంబులఁగావు" మనుడు, భూపాలుఁ డెంతయు వగచి, "కౌశికుండీతనిఁ గాలిసంకెల గాఁగ నావెనువెంటంబుత్తెంచె.

మునిపుత్త్రుని కీవిధి మూఁడె. ఇందుఁ బల్లెపట్టైనను లేదు. ఈతఁడు నింక నడువనోపఁడేమిసేయుదు'' నని తలపోయుచుఁ గొలఁకు లెందేనిఁ గలవే యని నలుకెలఁకులఁ గలయ వీక్షించు-చుండె.

అయ్యవసరంబున వెనువెంటందగిలియద్భ్రశ్యాకారుండై చనుదెంచువిశ్వామిత్రుండమ్మిత్రకులపవిత్రున కంతరాయంబు-లుగల్పించి యేప, నిజస్వాంతంబునఁ జింతించి, సాధుజనపాటన ప్రవీణుఁ డగు నొక్కనిశాటుని దంతఘాతకుం డనువానిఁదన మాయాపాటవమునఁ గల్పించి; వానితో "నీనేర్పు మెఱయ నీ త్రిశంకుపట్టిని మాయమాటలుపెట్టి మాపటిదాఁక నిచ్చోఁ బెట్టి,ఈరేయి నీనేర్పు మెఱయ శాకినీ భూత పిశాచ సహస్ర భీకరంబగు నల్లభేతాళవటముక్రింది నిద్రింపఁ బనుపుము. అం దలిభేతాళుఁడమరులనైనధీమసం బడఁగించి దిగఁబాఱ మ్రింగు నన మర్త్యులంజెప్పనేల? ఈప్రయోజనమునమకూర్పు''మనుట యు, మహాప్రసాదంబని యాక్షణం బా మాయలాడు తల వడంకెడు వృద్ధతాపసవేష మలవడ ధరించి మానవాధీశుఁ డరుదెంచుమార్గమునఁ దపోవేదిక నిర్మించి, యందు వ్యాఘ్ర-చర్మాసనాసీనుండై జడలెల్ల వ్రేలాడవిడిచి, దండకమండ లంబులఁజెంగటఁబెట్టి ముకుళీకృతనేత్రుండై, తనచూడ్కులు కొనముక్కుపైఁజక్క నిలిపి, జపమాలపూస లెన్నుచుండె. అంత మార్గవశంబున ధరణీశుండమ్మునింజేరి,యతనినిక్కంపు వానిగాఁ దలంచి, సాష్టాంగప్రణామం బొనర్చి కడుభక్తిమై "ఓమునిచంద్రా! ఇవ్వనవాటికలఁ బలుపాటులుపడి ద్రిమ్మరి

మత్పురాకృతపుణ్యావిశేషంబున మీపాదంబులం జేరఁ గంటి. కృపామృతము గురియు మీచూపును నాపయి న్నిగుడ్పవే?'' యనుడుఁ బెద్దయుం బ్రొద్దునకు నేత్రములు విచ్చి ''నీవచ్చిన జాడ నంతయు మాయోగదృష్టిం గాంచితిమి. నీవు హరిశ్చంద్రాహ్వయుండవు. నీ నిఖిలరాజ్యంబు నొక్కతపసికి ధారవోసి మును మఖార్థము దత్తంబగు విత్తముం బడయనిట్టి బెట్టిదంపుటడవుల నిడుమలు తొడరఁ నియ్యెడల నిట్లడలుచు సతీసుతయుక్తుండవై వారణాసి కరుగుచుండ, నీపై తరువు వచ్చిన మునితనయుండు నొచ్చి ఘనపిపాసాతురుం డగుటఁ గాంచి, బెగడి, నీకు వెదక వచ్చితివి.'' అనుటయు, హరిశ్చంద్రుండు చాల విస్మయంబంది, పునఃపునః ప్రణామంబు లాచరించి, ''మునినాథా! నేఁబోయి జలముఁగొనివచ్చునంత లోన గుత్తుకయెండి మునికుమారుఁడు చచ్చెనేని యాతనికతన బ్రహ్మహత్యసిద్ధించునొక్కో! నీకమండలజలంబు నవ్వాటునకుఁ బోసి, ప్రాణదానంబు సేయవే'' యనుడు, ''నాకమండలువు లోని జలము లల్పములు. ఈయల్పాంబుపానంబున నీతం డెట్లు బ్రదుకు! ఇచ్చటికిఁ గూంత వేటుదూరంబున నొక్కహ్రదంబు గలదు. అందలిసలిలంబు లతినిర్మలంబులు. తత్తటంబునమహా వటోర్వీరుహంబు బలిసినశాఖలతో బయలెల్లఁగప్పి యొప్పుచుండు. అచ్చటి కిందఱం గొని యుదకంబు గ్రోలి పథశ్రమం దీర్చి, యీరేయి నాపాదపంబుక్రింద వసియింపుము. అచట దక్కనీకన్య ప్రదేశంబిరవుగాదు'' అని యదృశ్యుం డయ్యె; జనవల్లభుండుల్లంబునంబడుతపనఁగనుఁగొనలేక చనినక్కైవడిఁ దపనుం డపరాబ్ధికిం జనియె. సందెచీఁకటి పర్వె. ఉరగం

బులు వల్మీకరంధ్రంబులు వెడలి చరియించె. శాకినీఢాకినీ పిశాచభూత భేతాళసంచారంబులు మెండుగఁ జెలంగె. ఇట్టి భయంకర నిశాసమయంబున నమ్మహీరమణుం డమ్మాయా తపసిసెప్పిన మఱ్ఱిచెట్టు చక్కటికిం జన సమకట్టి పట్టిం దన చంకనుబెట్టికొని చంద్రమతిం జెయిఁబట్టుకొని మునిపట్టిం దన మూఁపుపైఁ బెట్టికొని, కరంబునం బూనినఖడ్గప్రకాశము కర దివ్వియమై త్రోవఁ జూప, హ్రదంబుం గనుంగొని, తత్తీరంబున నందఱ నిల్పి, సలిలంబులఁ గ్రోలంజేసి, తానుం బ్రక్షాళితశరీరుం డై, సాయంసమయవిధు లొనర్చి, యందఱకు నిద్రపోవ ననువగుచోటు నలుదిక్కులఁ జూచుచుండ, బేతాళవటోర్వీరుహం బొక్కటి కాన్పించె. అఁ డప్పాదపంబుక్రింద లేఁబచ్చికశయ్యం గల్పించి నక్షత్రకు నందు సుప్తం జేసె. చంద్రమతియుఁ దననందనుతోఁడఁ దత్పదపద్మ సమీపభూస్థలిం దనుగట్టిన పుట్టంపుఁచెంగు మడతగాఁబఱచి హస్తం బుపధాన మొనరించి, దుస్తరంబగు బేరాఁకటమునిఁగి బడలి దైవముం దూఱుచు సుప్తిం బొందియుండె. అప్పు డప్పుడమిఱేఁడు తనపడఁతిం గని చిత్తంబునఁ బొగిలి యధిక పథశ్రాంతి మైమఱచి సుప్తి నొందెడి వీరలం దుష్టమృగ భూతవితతివలన నేయుపహతు లెసఁగకుండ వేగునంతకుఁ గావందగువని, కరవాలంబును హస్తంబున నిడి, వీతనిద్రుఁడై నలుదిక్కులం గనుఁగొనుచు నెచ్చరికమెయిం జరియించుచుండె.

అంత నర్ధరాత్రం బగుటయు నందు వసియించెడి పిశాచంబులు మానిసిగాలుం బసిగొనుచు మఱ్ఱియూడలవెంటం

దిగఁబాఱి దిక్కులు భేదిల్ల నార్చుచు, నొండొంటిఁ బిలుచుచు, చెలరేఁగిన పెరయీఁగలట్లు తఱిం గని యమ్మాన వేంద్రుం గదిసిపోదివె. భూపాలుండాబడుగుదయ్యంబులఁబట్టి వధింప నెట్టన మొలనున్న నెఱికత్తిం దివిచి భూతంబుల చెక్కులం జెక్కి ముక్కు సెవులఁ గోయ, నయ్యసికోఁతలసిఁబోవ్రటయు, నప్పిశాచంబులు నిజేశుఁడగు బేతాళునకు నన్నియుఁ దెలియ విన్నవించె. అతండు భీషణరోషావేశంబునఁ దారకలు మొలగజెలు గాఁగఁబెరెఁగి, బ్రహ్మాండంబుభేదిల్లఁ బెల్లార్చుచుఁ,బటు వజ్రనిష్ఠురచరణఘట్టనల విహ్వలీభూతపాతాళుండై భీకర ఢాకినీ ప్రేత భేతాళ శాకినీ గణము లసంఖ్యములుగఁ గొలువఁ బరుసని ఝంఝాఋపల్ల వెంద్రుకలజొంపము మారుతమునఁ గంపంబు నొందఁ జంద్రనిప్పులకంటె వేంద్రంబులగు కన్నుల కోపాగ్ని కణము లురులఁ బలలకబళంబు మెసఁగుచు నేతెంచుటంగని యయ్యిలాపతి నిర్భయుండై కరవాలంబు జళిపించుచు "నిత్తఱి వీరిని నిద్రసెడకుండ వీని నిర్జించుటయ కర్జం" బనుచు నెదురేఁగి యడ్డమై నిలిచి "నిద్రవోయెడి మా వారలకునిద్రాభంగము గావించితివేని కయ్యాలక్రచ్చలై కడఁగివచ్చు నీదయ్యాల ముక్కులందఱిగి నీగర్వభంగముఁ గావించి నిను దీర్ఘనిద్రఁ బొందింతుసుమీ" యనియె. నావుడు నబ్బేతాళుఁ డుర్వీశుం గని "మానవాధమా! నాకెదురాడెద వీవెవ్వండవు? నీ వాక తెంపరివోలె ఖడ్గమంకించుచు, శంక మాని చావఁ దెంపుచేసి పులియున్నపొదరిల్లు జింక జొచ్చినపగిది నురుల కేని తేఱిచూడ రాని నావటమూలంబునకు వచ్చుటయ గాక, యందలి కావలి భూతంబుల ముక్కులు చెక్కులు సెక్కి, యంతటఁ బోవక,

నాయెదుటఁ బెక్కులు ప్రేలెదవు. మహామారికడుపుఁ బొట్టేలు జొచ్చినట్లు నావనముం జొచ్చితివి. కటకటా! నీకు నేఁడేమొ కీడు మూఁడె. నను నలుగఁ జెనకిన నీకు మనికి గలదె? గన గనఁ గనలు ననలుఁ గాల మెట్టిన రిత్తవోవునే?'' యని కినుక నై శూలంబుఁ గేల నంకించి వైచిన జనపాలుం డద్దానిఁ ద్రెవ్వనేసి బెడిదంబగు వాఁడియడిదంబున నా ప్రముక్కిడి భేతాళునిఁ గ్రక్కున జక్కాడినఁ దక్కినబెక్కండ్రకు భీతి యెక్కుడగునని యొక్కవ్రేటున నుక్కడంచి కాలునిప్రోలి కనిపె. పాంథుల నిర్మూలనము సేయ సమకట్టినట్టిఫలము విధి సేసేతకట్టి కుడువక విడుచునే?

అయ్యవసరంబున నగ్గాధిపట్టి చలపట్టి కరుణఁబోవిడిచినీల మేఘంబులఁ బ్రేరేచిన, నయ్యవి గగనంబెల్లఁ గప్పి కాటుక కొంపినలికినగతి నొప్ప నంధకారం బంతకంతకు దట్టంబయ్యె. చెట్టు,గుట్ట, గుంత, మిట్టయనుచుఁ గనుంగొన ననువుపడకుండెను. పెనుభూజంబులు వేళ్లతోఁ బెల్లగిలఁగొమ్మలెల్లఁ బెళపెళ విఱుగ బల్లిదపుగాడ్పులు పెల్లుగఁజెలరేఁగ భీకరంబుగ వీచెను. భయంకరంబుగ వర్షంబు కుండకూల్చినట్లు కురిసె. అప్పు డన్నరవరుండు వానం దొప్పఁదోఁగి తడసి యంగంబులు నర ములు నొవ్వ విడువక రువ్వెడు విషమవాయువున గిజగిజ వడఁకు వడుగును నింతినిఁ బుత్త్రుం దిగిచి వగచి నిజాంక పీఠంబున నునిచి వారల నూఱడించుచుఁ దలఁకక యుండె. అప్పుడు గాధితనయుఁ డతని హృదయస్థైర్యంబునకు వెఱఁ గంది, కడుంగుంది ''సం దరసి వీనిసత్యంబు నిందింప వచ్చి

నేన నింద వహించువాఁడను; నేను వెడఁగనై యీ వసిష్ఠు తోడఁ గలహమొనర్చి వృథాశ్రాంతిఁ జెందుటయ గాని నా పన్నుమాయ లన్నింటికిఁ మన్నుఁ దక్కఁడేని తగిలి నొగలఁడయ్యె. బేలనై నేనేల కలహంబునకుఁ బూనుకొంటి? ఏల బెడిదంపుఁ బ్రతినఁ జేసితి? ఇఁక నిస్సంశయముగ వసిష్ఠుని ప్రతిన నెఱయు. పెద్దలతో నూరక కలహమునకుం బూనెడు వాఁ డపజయంబుం బొందకుండునే?'' యని తనుఁ దాన నిందించుకొనుచుండె. ఇంతలోన వేగు పొడిచె. మిత్రకుల పవిత్రుం డగు త్రిశంకుపట్టిని రట్టువెట్టిన నగ్గాధిపట్టిం గాంచ నేచినకోపమునఁ గన్నులెఱ్ఱఁజేసికొనివిచ్చె నెనోయన నిజారుణ కిరణప్రసరణంబు దెసలకుఁ గెంజాయపెట్ట నినుం డుదయ శిఖరిశిఖరం బలంకరించె. నృపతియు నచ్చోటు వాసి యరిగి ముందట నొక సరోవరముగాంచి, యందుసంధ్యాదివిధులం దీర్చుకొని, నానాకాననగ్రామంబులు గడిచి, ప్రతిదినంబును నాయాయిపల్లెల భిక్షాటనం బడిగి తెచ్చి, తొలుత నక్షత్రకు నకుఁ బూర్ణంబుగ నొసఁగి, కడమయన్నము తానుం గాంత యు సుతుఁడును భుజియించుచు పలుదేశంబులునుఁ బుణ్య తీర్థంబులును గడిచి చనుచుండె.

ఇఁటఁ గౌశికుఁ డగ్నిదేవు నాకర్షించి ''పావకా! తావక కీలానివహంబుచే నమ్మహీధవుం డరిగెడిమార్గంబున నెంత యు నవరోధం బొనర్పుము. నీకు సాయం బొసఁగ ననిలునిఁ బనిపెద'' ననుటయు నక్కఁరువలిచుట్టం ''బట్ల కాక'' యని యమ్మహీధవుం డరుగు తెరువునఁ బ్రబలి, మహోగ్రవాయువు ల గరగర నొరయుభూజంబులనుండి యొడిరాలిన కారాకు

ప్రోవులఁ జిఱునిప్పుకలు దవిలి రవులుకొని పొగసి పె ల్లెగసి బడబాగ్ని బలిసి లోకములెల్ల భస్మీకరింప నడరెనో యనఁ జుట్టుముట్టి మింట నంటు నెఱమంటలుజూచి ధరణీ వల్లభుండు చింతం దూలుచుఁ దన యింతితో "కాంతామణీ! ఈవహ్నికీలానీకము కడుం బ్రబలె. దీని నింకేవిధిం గడువ నగు. అంకించి మునితోడ నాడినమాట బొంకగున ట్లంకిలి యయ్యె. ఇంకేమి సేయుదు? ఇంక నాకొండుగతి లే" దని భక్తగుణావంశకరుం డగు శంకరుం ధ్యానించుచుఁ, దెగువ మెఱు భీకరం బగు కారగ్గి కెదురుసనుచుండె. చంద్రమతియు బుద్ధిమతియగుటంజేసి యనుందధైర్యమతియై, ప్రాణనాయకా! మనము మునిఋణంబుఁదీర్పనయితిగాక యీతని యసువుల కెగ్గుసేసితి మని లోకములోని పలుగాకులు తలంచినను దలంతురు. ముంతమూాయ మూఁకుడుకలదుగాని నోరుమూాయ మూఁకుడు లేదుగదా! ధర్మరక్షణార్థము సర్వవిధముల నాత్మ రక్షణంబు సేసి కొనంజను. ధర్మం బొక్కటియ మరణా నంతరము మనవెంటవచ్చును. కాఁబట్టి దారాదిబంధముం గోసివేసి ధర్మరక్షణోపాయంబున కానతియ్యఁగోరెద. ధృతిఁ బాసి యిట్లానతిచ్చిన నినుం బాసి యెట్లుండఁ జాలుదు? నన్ను వగలకుం దగిలించి పగఱకు నగుబాటు గావింపఁ దగునే? ఈ వహ్నిలోనున్న నేన చొచ్చెద. ఇమ్మునికుమారు ప్రాణంబుఁ గాచు నుపాయం బంతరంగమునఁ జింతింపుఁడు. మున్ను నాకీచనవిచ్చి పుచ్చుఁడని మాటికి వేఁడ, నమ్మహీకళత్రుండు నబ్బోటిపలికిన కలికిపలుకులు ములుకులై చెవులఁ జిలికిన నులికిపడి యశ్రుధారాపూరిత నేత్రుండై శిరంబు వాల్చి,

కరంబు విచారంబున నేమియుం బలుకనేరక యూరకుండుట యు, నది యంగీకారంబుగాఁ గైకొని పతిని వలఁగొని మ్రొక్కి ధేనువుంబాసిచననేరనివత్సంబుమాడ్కినుత్సాహంబు దక్కి తన్నుం గొంపొమ్మని పోరుఁబెట్టి కొంగుఁ బట్టి తివియు ననుంగుపట్టింజూచి, లోనఁబొక్కి యక్కునఁ గది యించి, చెక్కిలి నొక్కి, మున్నీరై గాఱు కన్నీరు దుడిచి, చుంచుదువ్వి మూర్కొని "నాయన్న! నాకూన! నాముద్దుల పట్టి! నాయయ్య! ఈపేర్చుమంటం జల్లార్చి వేగవత్తు" నని కుస్తరించి సుతు నొడఁబఱచి, యాశ్రితావనోల్లాసియు, దిన కరకులాంబుధిశశియు నగు నిజేశుకడ నిల్చి, గాధిపట్టి నియో గంబునం గార్చిచ్చుపుట్టి బెట్టిదంబుగా విసరెడి కరువలివలన మిన్నుముట్ట మిట్టి దరికొని యట్టె క్రాలుచుఁ జుట్టుకొని పరవంగని చంద్రమతి య య్యా భీలదావాగ్ని కించుకేని జడియక యెదురేఁగి, యగ్నిభట్టారకునకుఁ బ్రతిముఖంబై నిలిచి, కేలు మొగిచి, "వీతిహోత్రా! వాయుమిత్రా! పవిత్రా! మునిస్తోత్ర పాత్రా! నే మనోవాక్కాయ కర్మంబుల వదలక పతిభక్తిని వఱలుచు ధర్మనిరతిం జరి యించితినేని, నే నీధాత్రిని మహాసాధ్వి నగుదునేని నాదు విభుఁడు సూనృత విభూతిశోభితుం డేని, నీవు శీతకరాకృతిఁ జెంది, తొలుత నిమ్మహీదేవపుత్రునకు నక్షత్రకునకుఁ బ్రాణ దానం బొసఁగి, కౌశికుబుణంబుఁదీర్పఁగూడునట్లుగఁ బవిత్రుఁ డగు ధరిత్రీకళత్రుని, మదీయైకపుత్రుని నరసి రక్షింపు" మనుచు, రాయంచ కొలనిం జెచ్చెరఁ జొచ్చిన వడువునఁ జిచ్చుం జొచ్చె. అప్పు డప్పరమపావని సమీపించినంతనే

"యీయమ పాతివ్రత్యమహిమకుఁ జడిసి కాఁబోలు పావకుఁ డావలికిం బోయె. నిప్పుకలుపొగలుట లుడిగి సల్లారె. అప్పు డప్పురందరాదిబృందారకులు వెఱఁగంది యమందానందంబు న మందారకుసుమంబులం గురియించిరి.

అంత దవానలంబు సల్లారుటయుఁ బతివ్రతామతల్లి తలపువైవనవాడక యెలనవ్వు చిగురొత్తఁ జేతులల్లార్చుచు మందహాసచంద్రికలు నలుకెలంకుల బఱచుచు, మనోజ్ఞవదన మండలముతోఁ దొల్లిఁటియట్ల వచ్చి వల్లభునకుం బ్రణమిల్లి యుల్లసిత ప్రీతి సుతుని ముద్దాడుచుండె. హరిశ్చంద్రుండును "మునిపుత్త్రుంబ్రోచి కౌశికుఋణంబుఁ దీర్పఁగలిగె. నీయట్టి కులసతినాకుఁగలుగుటంబట్టికాదె యిట్టి బెట్టిదఁపుటిడుమగడవఁ గలిగితి. నీపుణ్యావర్తనమును లోకమున నెగడె. నాకెట్టి రట్టును దిట్టును నెసఁగదయ్యె" నని సముచిత సంభాషణం బులఁ దన ప్రాణేశ్వరిం బ్రశంసించుచుండె. కౌశికుండును న య్యన్నులమిన్న చెన్నుఱకయున్నంగని"బాపురే! ఇక్కల్యాణి కొక్కింతయైనఁ జెన్నరి యుండదు. అలకలు గమరవు. కన్నీరుచిలుకదు. జిగితప్పదు. మేనుసొలయదు. పసిమితప్పదు. అడుగులు కసుగందవు. దీని పాతివ్రత్యమహిమ నా తపో మహిమలమించి పొలుపొందెఁగా! ఈ నాయుద్యమంబు నింద్యంబయ్యె. ఆవంతయేని నేవంతనుఁ బొందకున్నది. పతి భక్తియ సతులకుఁబరమశీలంబు. భాగ్యమూలంబు పరమ భూషణము. భాగ్యపోషణము. భయనివారణము. నిఖిల శోభనకారణము. ఇంతికిఁ బడయంగరాని యతులితపుణ్యంబు లెందుఁగలవు? వెలపింపఁబోయి తా వెఱచిన తెఱఁ గయ్యెఁ

గదా! ఇంక నొందు తెఱఁగెద్ది" యని వెఱఁగుపడి డో
లాందోళితమానసుం డై, యంతరంగంబునం జలంబుదలం
బుగ నెక్కొంచి యొండు వెర వూహించుచుండె.

అంత నప్పూతచరితం బెడఁబాపి యాతనిఁ జాలిఁ బఱచుటయ యుఱ వని తలపోసి కొంతతడవునకు నిజాకారం బేరికిం బొడగానరాకుండ నక్షత్రకుం గదిసి "ఏచందమున నైన నీచంద్రమతికిఁ దనపతిపై నెసఁగినకూర్మి వీడిపోవఁగాఁ బల్కి వారలకు విరిపోటు సేసి జోడుఁ బాపుము. దాన నా సేయు కపటకృత్యములు జరుగును. అటుఁగాదేని కొనసాఁగ లేవు. ఇది నిక్కువంబు. నీవటుచేసితేని నా శిష్యులందఱ లోన నిను నష్టాదశవిద్యలందు బలవంతుఁ గావించెద" నని తిరోధానంబునొందె. తదనంతరము నక్షత్రకుండు చంద్రమతిం జూచి యాయమ పాతివ్రత్యమహిమను వేవేల తెఱఁగుల నుతించి "దేవీ! ఇంద్రాణియు, నరుంధతియు, ననుసూయయు, లోపాముద్రయు నీకెనయగుదురే? అనలంబునకాహుతి యైన నా యసువులం గాచిప్రోచిన నీకుఁ బ్రాణదాన ఫలంబు గలిగె. ఇందుకుఁ బ్రత్యుపకారం బొనర్పంబూనితి. అమందబుద్ధిం బొంది వినుము. నీ కీ మానవేంద్రు వెంటం దిరుగ నాశించెదేని బహుప్రయాసంబులనొందుట నిక్కువంబ. దావపావకశిఖానివహం బడంచిన ట్లాపాలలోచనానలము కంటె నుగ్రతరంబగు కుటిలకౌశికు తీవ్రకోపానల మడంప శక్యంబుగాదు. అదియుఁ గాక నీభర్త గుఱించినమితికి. నీకుఁ బదిదివసంబులే కలవు. ఋణమున నొక్కవీసంబైనఁ జెల్లకపోదు. ఆతం డొకింతయైన బొంక నేరఁడు. కౌశికుం

డఱిగి వేఁడిచూపుల రాలు నిప్పులు కుప్పలుగొన నను కంపలేక డెంపుఁజేసి "తడయక మాధనం బి"మ్మని యద లించిన నిన్నును నీసుతుని నేరికైనఁ దనయక్కఱకుఁబోయి నంతకు నమ్మిపుచ్చును. ఇంతవట్టు కిది నిశ్చయంబు. నా పల్కు నమ్మి నిరవధికసుఖానంద నికేతంబగు సాకేతంబున కేతెంచితివేని రాజ్యంబును నాకుఁగాఁ గైకొని నీ కిత్తు. నీ సుతునకుఁ బట్టంబుఁ గట్టింతు. కావున నీముద్దుపట్టిం దోడు కొని నీపట్టణంబునకు ర"మ్మనియె. ఆ చుఱుకుఁబలుకులు వాఁడిములుకులవడువునఁ జెవులు సోఁకుటయు న మ్మగువ చిన్నవోయి నెమ్మొగం బసమ్మతంబుఁ దెలుప తన మొగం బున వెడనగ విగురొత్త నవ్వొడగువ మగుదెసఁజూచి "భామిని కిం బ్రాణనాథుండు మనోవాంఛాప్రదానుఁడు, నేత్రోద్దు నోప్సరత్నాలంకారమును, నిత్యానందసంపాదియు, మఱియు వేయునేల? ఏడుగడయు నాథుడ. పతిలేనిమగువకుఁ జంద్ర కాంత వేదులు సూదులు. కస్తూరిపూఁతలు రోఁతలు. పూర్ణ చంద్రికలమెఱపులు వెఱపులు, మకరందరసములువిసములు. కులశీలములంగోరి బ్రతుకు పతివ్రతల కిహపరంబులఁ దోడును నీడయుఁ బెన్నిధియుఁ బట్టుకొమ్మయు; పతిలేక యీరాజ్య సంపదలేల ? సతులేల ? సుతులేల ? బంధులేల ? ప్రాణంబు లేల? ఓ వెక్కురువడుగ? అల్పురాండ్రగు స్త్రీపిశాచంబులు నిజస్వభావజనితగుణములచేఁ బ్రయోజనము లేని కారణముల చే మహామహులనైన వంచింతురు. వికారవిధేయులం జేయుదురు. వారల దయార్ద్రకోమల మనంబులు లోఁగొం దురు. బుద్ధిగలంతురు. విషాదపెట్టుదురు. వెఱపెట్టుదురు.

ఆసలంగలంతురు. ఆత్మదాసులనుగఁ జేయుదురు. మఱేమి చేయఁజాలరు? నే నట్టి నీచురాల ననుకొంటివే? ఈ హరిశ్చంద్రుఁడు కౌశికుచిక్కులకుం దగిలి చిక్కుననుకొంటివే? మాయన్యోన్య నేస్తమునకు భంగంబొనర్ప సమకట్టితివి కాఁబోలు. ఆతండు నీయట్టివారికిఁ బట్టువడునే? ఈ వెడమాటలుడుగుము. నీవును నీగురుండును నిఖిలదేవతలును మేలు మేలనఁ దసనిత్యసత్యస్ఫూర్తియు నిర్మలతరకీర్తియుఁ బ్రబలనియ్యరవిందమిత్రగోత్రంబు నిందాపాత్రంబు గాక యీ ధాత్రీకళత్రుండు భూచక్రంబెల్ల నిర్వక్రంబుగ నేలు'' ననిన గగనవాణియు సత్యం బని మ్రోసె. అంత నక్షత్రకుం డూరకుండె.

ఇట్లు మిన్నులమ్రోఁతం దాలిమివహించి, డెందంబున నానందంబునొంది, యానందాశ్రులు గడకన్నులఁ గ్రందుకొన నమ్మనుజేశుం డమ్మగువం జూచి, "మనకిచ్చో నాలసింపం బనికాదు. ముయ్యేఱునేల యగు కాశీనగరంబు ముందఱనున్నది. అప్పురంబుఁ బ్రవేశించి కౌశికు ఋణవిమోచనోపాయంబుఁ జింతింపం జను. ఇందుకళాధరుండప్పురి నేలును. ఆ విశ్వనాథుఁడే మనయాత్మబంధువు. ఆతఁడే మనకు దైవంబును తాత్రియు. ఆయనయే మనమచ్చవలసిన ఋణంబునకొక్క తెగసేయఁగలవాఁడు''అని కాంతాసమేతుండై కొంతదవ్వరిగి శ్రీకరంబును నచ్చటివాస్తవ్యుల కనంతఫలదంబును సేవకాజనంబులకు మోక్షం బఱచేతిదియు నగు నవ్వారణాసిం గని, యందు నిర్మలతరంగిణియగు గంగంజూచి ప్రముదాంతరంగుఁడై కేలు నుదుటఁగీలించి,

కాంతానందనయుక్తముగ నందవగాహనంబుఁ గావించి, యాహ్నికక్రియలందీర్చి, యచ్చోఁ గొంతదడవుసేదదీర్చుకొని నచ్చో వాసివచ్చుచు వాసిఁగలిగించు పుణ్యారాశియు, భక్త యోగపదన్యాసియు, పావనక్షేత్రము నగు వారణాసింజేరి, తన దేవితో, "పంచాస్యమధ్యా! పంచమహాపాతకుఁ డగు పంచజనుఁడైన నిచ్చోఁ బంచత్వముఁ బొందెనేని పంచబాణారి యగు" ననుచుఁ గాశీక్షేత్ర మహిమల వర్ణించి చెప్పుచుండె. ఇంతలోఁ గుముదమిత్రోపల గోపురంబులచేఁ జతుర్ద్వారబంధురంబును, ముక్తాతపత్ర సుందరంబును నగు విశ్వనాథు దేవళముఁ గాంచి, యాసార్వభౌముం డద్దేవతాసార్వభౌముని దర్శించి మొ్రక్కి ప్రదక్షిణ మాచరించి "గౌరీమనోల్లాస! కాశీనివాస! కౌశికునిఋణం బీకాశిలోనఁ దీర్పం దెరువుఁ గల్పింపు"మని సన్నుతిసేసి యచ్చోటువాసి త్రిశూలహస్తుఁ డగు కాలభైరవుం గొలిచి, యాశ్రితకామధేనువులగు నన్నపూర్ణావిశాలాక్షులకు వందన మొనర్చి, వెండియుం గలుగు విశేషదేవతాస్థానంబులు దర్శించి కృతార్థుండై యుండె.

అయ్యవసరంబునఁ గపటక్రియాదక్షుండగు నక్షత్రకుఁ డద్ధరణీపునీక్షించి, "మాగురుఁడు నీకిచ్చినమితి నేఁడు నెల్లియుఁ దక్కవగ నెలనాళ్లయ్యె. పుట్టెడునప్పుతోఁ దలమునిఁగితివి, ఇఁక పుట్టెడెన నీపుట్టెమి మునుఁగు? ఇప్పటికి వచ్చుపైకమైనఁ జేరదాయె. ఇట్లు తచ్చులుచేసి మోసపుచ్చఁ జూచెదవు. "ఆలస్యాదమృతం విషం" బనువాక్యము మఱచితే? ఇప్పు డేమఱుపాటునఁ గౌశికుండే తెంచి ముప్పిరిగొను

కోపంబుననప్పుడిగిన నేమి సేతువు? నాకుఁజదువునంతరంబయ్యె. నీజాగు పీనుఁగుతోడి జాగరంబుఁ బోలియున్నది. నీసత్యంబె నీకొంపచేటునకు మూలంబాయె. ఇప్పరి నీ విన్నినాళ్లు వసి యించియుంట ముక్తినీకరగతంబయ్యె. అటుగావున నీ వికఁ లక్షుఁబొంకినను నిహపరంబులం జెడవు. "నీయప్పెఱుఁగ బో మ్మని బొంకితివేని నేఁ బోయెదను. అటుకాదేని, నిఁక నిన్ను గుల్లపఱుపక నొకకొలికికి రావు" అని యంతరంగము చిల్లులు వోవ నాడు నిష్ఠురంపు పల్కులు ముల్కులై తోఁప "బ్రాహ్మణోత్తమా! ఈశ్వరుం డొక్కచోటుననె యుండుననియు నీస్థలంబె పవిత్రమై యందఱఁ బరిశుద్ధలంజేయు ననియుఁ దలఁపఁబోకుము. సత్యముపలుకకయె కాశిలో నిత్యవాసముఁ జేసినంతమాత్రమున నఘరాహిత్యముఁ బొందు ననుకొంటివె? అల్పసౌఖ్యంబుకొఱకై యసత్యముపలుకుదు ననుకొంటివి కాఁబోలు" నని తానును బత్నియుఁ దనయుండును దక్క నితరధనంబులొండేమియుఁ గలుగు మతంబుఁ గానక, చంద్రమతిదెసఁ జూపులు నిగుడించి బెట్టు నిట్టూర్పులు నిగు డ్చుచుఁ గన్నీరు గ్రుక్కుచు, నొండునుడువనోరురాక, కొందలం బంది, మోమరవాంచియుండు జీవితేశ్వరుంజూచి. యా సాధ్వీలలామ "నాథా! ఆపదలందు పందతనంబుమాని బుద్ధి నెగడునందాఁక నాత్మబలంబునం జరియింపందగు. భూచక్రం బెల్ల నిర్వక్రంబుగ నేలిన రాచపాడవయ్యు, విభ్రాంతిఁ జెంది చింతమైనుండఁ బాడి గాదు. మీ రేటికి దైన్యంబు నొందెదరు? మితి సరిగడచి గడియతడవైన గాధిపట్టి నినుఁ జలపట్టి బొంకింపఁ గంకణంబుఁ గట్టుకొని యున్నవాఁడు.

మిము మాటి కివ్వాటువాడెడి మాటలు చెక్కిలిఁగొట్టి పాలు ద్రావించు చందమయ్యె, ఈతఁడు మన యిలువేలుపనం దగి యున్నాఁడు. జపతపదాన దేవోపచారంబు లన్నియు సత్యం బునకు సరిరావు. కావున నిప్పుడక్క ఆ వాపికొను వెరవొండు గానరాదు. నను విక్రయించి గాధిపట్టి ఋణము గొంత యైనఁజెల్లించినఁగడమకు నెల్లిటికి నొక తెగగల్గు''ననిసవినయ మధురంబులగు వచనంబులు నుడువ నపుడు, భూవిభుండశ్రులు ఱెప్పలనప్పళింప, ప్రేయసీ! అనుచిత భాషణముల నావీనులం గదియించి పాపంబుఁ గట్టుకొనఁ బాడియే? పతుల కెట్టికష్టంబని సేసి యైన సతులం బ్రోచుటయే ధర్మవైయుండ, నవ్వారిగఁ బగవారునగ, ననుఁగులు వగవ, మగువం దెగ నమ్మజూచుట తగవగునే? సత్యవర్జన మెంతధర్మవిరుద్ధమో ధర్మపత్నీ విక్రయమును బురుషున కంత ధర్మవిరుద్ధమే. జ్యోతిష్మంతునింటఁ బుట్టి, త్రిశంకునింట మెట్టి, నావంటివానిఁ జేపట్టి యింతియై గేస్తురాండ్రకు మేల్బంతియై వన్నెకెక్కిన నిన్నునొక్కనికి దానిసఁగ దెగ నమ్మఁదగునే? దయమాలి యిల్లాలినమ్మి మనంబూనెడివానికంటె దోసకారిగలఁడే? అట్లు మనెడి యామాలబ్రతు కేటి బ్రతుకు? అట్లు బ్రతుకందగు నింద్రపదమైన నే నొల్ల. అపకీర్తి లేనిజీవనము నిక్కముగ నొక్కనిముసంబె చాలును. ప్రాణంబుల నొత్తి కుత్తుకలు గోయు కటికవాఁడైనను దనకళత్రము నమ్ముకొనునే? యనుడు, నప్పడఁతి ''నాథా! భార్యారక్షణము ధర్మరక్షణము కంటె నెక్కుడు కాదు. ''ఆపదవేళల నిజపత్నినైన నమ్మి తనకు వచ్చినబారిఁ దప్పింపవలయు'' ననెడి నీతివాక్యంబును

" నానృతాద్దుష్కృతంపరమ్ " అనెడి వేదవాక్యంబు ననుసరించి భార్యావిక్రయ పాతకంబేని౯ బాయనగునుగాని మిథ్యాదోషంబు౯బాయ నేరితరమునుగాదు. అనృతభాషణు కంటెదోషాధికుండును, సత్యవాచాన్వితునికంటె నిత్యసుకృతి యు౯ద్రిభువనంబుల నెంచినను౯ గానరారు. ముముక్షువులకు దారసుతాదులు గాలిసంకెల లగుటంజేసి సూరిజనంబులు వీని పై మక్కువసేయక తన్మోహలతల౯ ద్రెంపుదురు. కావున నిత్తఱి ధృతి౯ జిత్తంబున నిలిపి వక్రముగ నాడుటుడిగి నను విక్రయింపుము. నిండుమనంబుతో మెండుగ మిమ్ము నేన వేఁడుటంబట్టి భార్యావిక్రయ పాతకం బణుమాత్రంబేని మిమ్మంటదు. ఆలసింపక నన్ను దాసినిగా విక్రయించి మీ ఋణముందీర్చి, మిమ్ము బొంకింప౯ గంకణము కట్టుకొన్న విశ్వామిత్రుని ప్రతిజ్ఞ బొంకుజేయుఁడు. మీ రంగీకరింపక పోయినను నాకు దాస్యవృత్తి తప్పునదికాదు. అదేమంటిరేని పూర్వము దూర్వాసు౯డొకప్పుడు నన్ను మూఁడుమాసములు దాసిగానుండ శపించెను. కతంబెద్దియన నాబాల్యంబున నే వాకిట నిలిచియుండ౯ గిరాతు౯డొక౯ డొక కీరపోతంబునుం గొనిపోవుచు నా కమ్మ౯ జూపెను. అయ్యది మిగుల మనో హరం బగుటచే దానిని ముచ్చటపడి కొని పండ్లను బంచ దారయు౯ బెట్టి ప్రాణతుల్యముగ౯ బెంచుచుంటిని. ఇట్లు మూఁడుమాసములు గడువనొక్క౯నా డాకస్మికముగ దుర్వా సుండు నాజనకునిం జూడవచ్చి నాకీరంబునుంజూచి దాని వృత్తాంతం బారసి మండిపడి కటములదర ముకుపుటములు బెదర నావంక౯ గన్నుల నిప్పులొలుక౯ జూచుచు "మా

యాశ్రమ వృక్షమునుండి కిరాతుఁ డపహరించి తెచ్చిన శుక పోతముం బంజర బంధముం గావించి బంధించితివి గాన నీవును దాసివివై సేవాబంధ మనుభవింపుము.'' అని ఘోరశాపం బిచ్చె, మాయయ్యయు నా బాల్యచాపల్యముచే నెఱుఁగక చేసిన నేరము క్షమింపఁ బ్రార్థింప నా మునివల్లభుండును గొంత ప్రసన్నహృదయుండై "మూఁడు నెల లీచిలుకను స్వేచ్ఛావిహార భంగముం గావించె గావున నీమెదాస్యమును మాసత్రయావధియే '' యని యనుగ్రహించి చివాలున లేచిపోయెను. కావున నాబ్రాహ్మణ శాపహతిచే నా కవశ్య భోక్తమై దాస్యమును దీఱును. మీఋణమును దీఱును. నామాట కడ్డకాలు వేయఁబోకుఁడు'' అని ముదముసఁ జాఁగిలి మ్రొక్కి హస్తంబులుగదియ మొగిడ్చె. అల్లైక్కుడుగ వేఁడు నక్కళ్యాణిం జూచి, వసుంధరావల్లభుండుల్లమున నొక్కింత ధైర్యంబవలంబించి, 'నాఁడు పేర్చునార్చిచ్చుఁ జోరనంపిన నాయట్టికఠినాత్మున కిప్పుడీ తెంపుసేయుఁ టెంత? కట్టా! కట్టిడి దైవము నీయట్టి ప్రియతమ నేఁటితోఁ బాప సమ కట్టెనా! నాపూర్వకర్మం బట్టిది. కల్యాణీ! నాకతన నీ కిట్టి నలఁకువ వచ్చె, నిట్టి నగుబాటువుట్టె. పెంపెసఁగ రాజులదేవులెల్ల నీకె పరిచర్యలు సేయ, నతుల వైభవం బులఁ జరియించెడు నీ విప్పు డెక్కరణి నన్యులకుం బరిచర్య లు సేయఁగలవు? నీవు నా సమీపంబున వసియించుటం జేసి నాకు నిశలు పగళ్లగును. వనములు పూఁదోటలగు. గిరిగహ్వ రంబులు గృహంబులుగఁ గానంబడు. జీర్ణపర్ణములె కెంజిగు రాకుల మేలి పానుపులయ్యె. నిను బాసి నిమేషంబేని యుండఁ

గలుగునా?" అని చింతాపరంపరాయత్తచిత్తుం డగుచు నృపోత్తముండుండె.

అయ్యవసరంబునఁ ద్రిశంకుపుత్త్రునిఁ దాపసపుత్త్రుఁ డుచూచి, "ఓహో హో హో! నీమాటలు వాటముగనున్నవి. ఇదె యదె నేఁడు రేపనుచుసామ్మిాక కాలము గడపుచున్నావు. నేనిఁక నెంతకాలము తాళుదును? రాజ్యసుఖంబుల మరగి రాజసవృత్తినున్న నీకు వణిగ్వ్యవహారులవడువున వాణిజ్యమునం గాని భూజ్యత బ్రాహ్మణాకృతిని బిచ్చంబెత్తిగాని ధనంబు గడియింపఁగా రాదు. ఇఁక మాఋణమెల్లఁ దీర్ప నీవెవ్వడు వున ధనంబు గడియింప నేర్తువు తామసం బేల సేసెదవు? ఆలి నమ్మ జాలి నొందెదవు. నీయక్కఱకై నిక్కలకంఠకంఠి నమ్మునట దక్కఁ దక్కిన వేఱొండుపాయంబు గలదేని చూడుము. లేదేని గ్రక్కుననంగడికిరమ్ము. నీటక్కులు నాకడ సాగిరావు. ననుఁ జిక్కులంబెట్టక లేచివచ్చెదోమానికడకు వచ్చెదో? నాకాసలంబెట్టి వేసాలుపన్నక వేగలేలెమ్ము?" అని పెక్కుభంగుల నాడు నిష్ఠురవాక్కులకుం బుడమిపతి కడుంగలంగి, యాత్మలోఁ రోసి, నిముసంబేని యచ్చో నిలువక రమణినమ్మ రాజమార్గంబునఁ జనుదెంచుచుండె. అంత న ప్పౌరజనంబు లాతని యందంబును చందంబును గని, "ఇతం డిందిరానాథుండ. కాదేని యింద్రుడో చంద్రుఁడో" యను వారునై యుండిరి.కొంద"ఱాతఁ డిందిరాధవుండగునేనియురం బునఁకౌస్తుభంబు చెలువొంద లేదే?" యనువారును, మఱి కొంద "ఱాతం డింద్రుఁ డగునేని వెల్లఁటేనుంగు లేదే?" యనువారును, "ఈతని తేజంబు నిగురుగప్పిన నిప్పుకమాడ్కి

నున్న'' దనువారు నై, యాతని పిఱుందం జనుదెంచు చంద్రమతిం గని పలుపలువిధంబుల వితర్కించుచుండిరి. అప్పుడారాజు తనవృత్తాంతంబును నాదినుండి పూసఁ గ్రుచ్చిన ట్లెఱుకపఱిచి, "పౌరులార! సుస్థిర మహోదారులార! కలనైన నవ్వులకైన నిసుమంతయేని బొంకి యెఱుంగని పుణ్యవతియుఁ దప్పుచేసిన తన్నుదూఱినఁ గోపించి యెఱుంగని గుణవతియుఁ బెఱలను దనవారల వేఱుగాఁ జూడక సమతనారయు సదయమతియుఁ, గానిమాటలు తన్నుఁ గలుషాత్ములాడినను గలహింప నొల్లని గరితయుఁ, బరులసొమ్ముఁ దృణంబుగ భావించు ధన్యచరితయు. సత్పుత్రవతియుఁ గృపామతియు నగు చంద్రమతిని ఋణవిముక్తికై పోఁకడ బెట్టువాఁడ. విల్వఁగరం''డని యందఱం బిలువ, వాడవాడలవా రెల్లఱును గుమిగూడి యశ్రుపూరిత నయనులై "కట్టా! దానంబు లొసంగినవారు లేరే? తలము తప్పనింత లేసి యీవు లియ్యఁదగునే ? ఇంకొకనాఁటిమేలు నాసించి, నేఁటిసుఖముం బాసి, యాలుబిడ్డలు దగు లని రోసి, దయమాలి యిల్లాలి నమ్మి, మొగిలులోని నీటిని నమ్మి దొననీటింజల్లి, తన్నుమాలినయట్టి ధర్మంబుగలదను నిట్టివేదుఱు గలఁడే?'' యనువారును "కావుననే చేసిన నేరమికి దైవంబు చేసేతఁ గుడువంజేసె'' ననువారును, "ఈతని ననవేల? తొల్లి భూవల్లభులు విప్రులకుఁ దగినదానము లియ్యరే? ఇట్లు పగగొని తరువులు వెట్టి దారలనమ్మించిరే? బ్రమొక్కఁబోయిన గుడి మీఁదఁ బడినవడువున దానంబిచ్చిన పుడమిపతికి మునిపతిచే దొసఁగులు దగిలెఁగా! వెన్నవ్రేసినవాని ఱాత వ్రేయనగునే? ఆహా!

ఇప్పుడమిసురు లెప్పుడును వెడమతులు. ఉపకార మొనరించు వారి కప్పుడ యపకారము గావింతురు. తొలి గుజ్జువడుగు మూఁడడుగులనేల బలిని వేఁడి తుదకెట్లుసేసె? కశ్యపాది భూసురు లిలయెల్ల జామదగ్న్యుచేఁ బడసి నీరధిలోనం గా లూఁదంగనీక చేసిరికాదే? వేయేల? తొల్లి యీ కౌశికుండె వసిష్ఠునింటఁ గుడిచి తుది కాతనికే ద్రోసఁగులు పొసఁగించెఁ గాదే? ఇప్పుడాతపసి దానవుండై తనముల్లె దాచిపెట్టినట్లు తనవంటి పాత్రుని వెదకి దానమొసంగిన నరవరుని నల్ల నల్లన ద్రావుచున్నాఁడు. ఇట్లీసాధుచరిత్రుని చిక్కులు పెట్టెడి యతఁడు విశ్వమున కమిత్రుఁడుగాక మిత్రుఁడెట్లగును? అతఁడువిశ్వామిత్రుఁ డనఁదగినవాఁడే. అతఁడు పీనుఁగుపైఁ గంచము వెట్టి కుడువఁజూచు కకుర్కాత్తిగాఁడు'' అని వగచుచు, ''మన కిచ్చెలిని వరవుడుగాఁబనిగొన ననువగునే? రొంపిఁ జిక్కిన కరినెత్తఁ గరిగాక సూకరం బెట్టులోపు? సింహము నకుదండ సింహముగాక జంబుకం బగునే? ఇంత వానిదుర్దశ నాప విశ్వనాథుండుదక్క నొరులెట్టులోపుదు?'' రని యుగ్గడించుచు మనకిచ్చెలువ విలువకుఁ గర్తన్యంబుగాదని పుర జనంబులు నిజమందిరంబులకుం జనిరి.

ఇంతలోశనైశ్చరుఁ డటమున్నె గాధిపట్టిబోధనచేఁ దత్పురి కరిగి వికృతవేసముం బూని సంపద్యుక్తుండయ్యు నద్దాని ననుభవింపఁగ లేక, కాకికి బలియు నీఁగకు కాటు నీక గండడై యక్కఱ కలవారికి రొక్కమును వెక్కసంబుగ నొడ్డి వడ్డిని వృద్ధిఁజేసి, మటుమాయలాఁడై కాలకౌశికుఁ డను పేరు వడసియుండె. అతండు జననాథుని మాట

లాలించి, "నేఁడు వీఁడు చిక్కెఁబో! ఇఁకఁ జిక్కులఁబెట్టి కౌశికు మెప్పింప నవసరంబుగలిగెను. ఆడఁబోయిన తీర్థ మెదురయ్యె. వీని కెట్టైన బోధించి భావంబు కలఁచి యింతి నమ్మెడి కోర్కె మాన్పింతును. ఇంతలో నేఁడు నెల్లియుఁ గడుచును. పుడమితేనినుడుపును బొంకు పొరయును." అనుచు ఱేనిముందల నిలిచి యుండెను. అంత నాతని యఱుతం బెనఁగొని యున్న యుపవీతంబు కతన విప్రునిగా నెఱింగి చేయెత్తి మ్రొక్క భూసురుండును వాని కులనామంబులు దెలియు నందాఁక దీవింప నొల్ల కుండుటయు భూకాంతుండు తన యుదంతం బంతయుఁ జెప్పి కాలకౌశికుసంశయంబు మాన్పంగని, విప్రుఁ డన్నరనాథుంజూచి, యప్పులుగొని యెగ వేయు ననువులఁ గొన్నింటిఁజెప్ప నవ్విపరీత బుద్ధులు విన నింపుగాక "అనృతంబొక్కటియేయైనం బురుషుని నరక గామినిం జేయకమానదు. సూదిబెజ్జంబంత చిల్లి యున్నం గడవెఁడు జలంబు కాఱుఁగాదె? పాపకృత్యంబున కింతయేని యెద సందువదల నొల్ల" నని నిష్కర్షగాఁజెప్పె. కాలకౌశికుండును భూకాంతుని సత్యసంధతకు విస్మయం బంది, "జన వల్లభా! నీకపాయంబు దొలంగు నుపాయంబుఁ గఱపిన విన నొల్లవుకా! నీవెట్టిసత్యసంధుఁడవయ్యును ధనముపట్లఁ గొంత సడలు విడువ నగును. "సర్వేజనాః కాంచన మాశ్రయంతి" యనెడి యార్యోక్తివినవే? పాలొల్లని పిల్లియుఁ దియ్యని చెఱకుపానకము విసమని వెడలఁగ్రక్కు వారునుగలరే? నీకు హితవుఁజెప్పఁగ మాకేల? మీఁద నీకెట్టిగతి పుట్టగల దట్టు

గానిమ్ము. నీవు జాలిమాలి యాలి నమ్మ మాకేల సంతాపము?'' అని పంకజాప్తకులజుఁ డడిగినన్ని పైడిటంకంబు లిచ్చి పదపద యని యదలింపఁ గ్రేపుఁబాసి గోడ్డొఱకెడిపగిది నడలుచుఁ బదములు సాఁగకుండ చంద్రమతి కురులఁ బట్టి బలిమిందిగిచె. అప్పుడు బాలవత్సంబు కరణి వెనుఁదగిలి పయ్యెదకొంగును బిగియఁబట్టీడ్చెడి లోహితాస్యుంజూచి, భూపాలుండు దాలిమి వదలి యశ్రులొలుక దైన్యంబున ధేనువుంగొని క్రేపుఁబాపుట యనుచితం బనియుఁ దన సుతునకునుఁ గోటి హేమనిష్కంబులు దెచ్చి యిమ్మనుటయు, ధేనువునకును గ్రేపునకును వేత్వేఱజట్లు లేవనియు చంద్రమతిని మొదలవిల్వఁగ నందనుఁడును నావిల్వలోనివాఁడెయగు నని నక్షత్రకుండు వారితగవులందీర్చె. అంత రాజచంద్రుండు నెక్కడి ధర్మం బెక్కడి తగవు లెక్కడి దైవం బింకెక్కడి సత్యము ? గతోదక బంధనంబని యవ్వడుగు పిలువని పేరంటముగ వచ్చి కాలకౌశికునకు నిచ్చకంబులాడు చెఱెంగి వెచ్చనూర్చి, ''యఖిల సామ్రాజ్య సంపద లనుభవించి వైభవ సమగ్రుండగు సార్వభౌమునకు దేవివైయుండి నేఁ డొక్కనికి దాసివైతివికదా! కటాకటా!'' యనుకొని. దైవ ఘటనఁ గడువఁగలేక, కనుఁగవ నశ్రులుదొరఁగఁ తలవాంచి యుండె, అప్పు డావనితారత్నము తన నాథు దీనాకారం బీక్షించి వంతఁ దొఱఁగి, నిజస్వాంతంబున నెంతయు ధైర్యంబు నిలిపి, ''క్షితిపాలచంద్రా! సత్యసాంద్రా! విధివిధానం బెవ్వరు దప్పింతురు? మనము కౌశికు మాయాపాశంబులకుం జిక్కితిమి. ''యతోధర్మస్తతోజయ'' మనువాక్యము

మనంబున నూనియుండుము. ఎల్లవారికి ఖేదమోదంబులు కాలానుగుణ్యంబులై యాపాదిల్లుట నైజంబు. దైవ తంత్రంబు మీఱ నెవ్వారునునేరరు. నక్రంబు పట్టిననాఁడు గజేంద్రునిఁ జక్రాయుధుండు విక్రమంబునఁ గాచి విడిపించి నట్లు మహేశ్వరుండు నినుం గాచును. నా నోముఫలమున మగుడనచిరకాలంబుననె శుభదినంబులువచ్చి పునస్సమాగమ సౌఖ్యంబు లభియింపక పోదు. గాధిపట్టి కపటకృత్యంబులకుఁ జలనంబునొందకు" మని ధేనువుంబాసి చననేరని వత్సంబు నుంబోలె నుత్సాహంబు దక్కి పతికి మ్రొక్కి సుతుని మ్రొక్కించి వలగొని తనయంతర్నిరుద్ధ బాష్పవ్యాకులితావ లోకనంబులువీఁకందనప్రియుని దెసనిగుడించి మగుడింపఁజాలక, యవలఁ జనఁగాల్లురాక, కనుఁగొలుకుల వెడలు నశ్రువారిం గోటమీటుచుండెను. ఇంతలోఁ గాలకౌశికుం డత్యంతరోషా వేశంబున, "ఓసీ! గోసిగట్టిన నాటంగోలెఁ బీనుఁగుల మోసి గడించిన మూలధనంబులెల్ల రాసిపోసి నినుంగొంటి. నాయెడ భయ మొక్కింతయు లేక ముచ్చుపగిది నీమగని డాసి వానింబాసిరానేరకున్నావు. ఏమటించి యుఱికిపోఁజూచెదవే? నీమందెమేలములు మానుము" అనుచుఁ దంఢ్రిమఱుఁగుఁ జొచ్చిన కుమారుని కూఁకటిఁబట్టిలాగి తిగిచి, యింటింటఁదిరిగి తిరిపమెత్తినధాన్యపుమూటల నన్నింటి నొక్కపెనుమూటగాఁ గట్టి యాలేమనెత్తికెత్తి "జాగుమాని కదలు" మని యద లించుచుఁ జనుచుండె. అంత నన్నెలఁతయు నడు మసియాడఁ గన్నుల నశ్రులుజారఁ గొంకుచుఁ జనుచుండ దానింజూచి, వాడ వాడలఁ బుణ్యకాంతలు డెందంబుల వగనొంది, "కట్టా! కచ

భారమోర్వలేని యంస మీఁధాన్యంపుమూటల భార మెట్టు లోర్చె? ఎన్నఁడు నెండఁగన్నెఱుఁగని యీచిన్నిబాలుఁడు గన్నుల నశ్రుకణములు గాఱనేడ్చెడిని. కన్నవారికిఁ గడుపు చుఱుక్కనుఁగాదె ? భూతదయారహితుఁడును వీతవివేకుఁడు నగు నీతని విప్రునిఁగ విధి యెట్లుసృజించెనోక్కా!" యని పౌరకాంతలు నోరికోలందులాడుకొనెడి యాడికలు విని, మెటికలు పెళ్లని విఱువం గని కాలకౌశికుండు కడుం గినిసి నిజదండంబునఁ బ్రచండముగా నప్పుండరీకలోచనలం గదిసి వేసె. అయ్యలికులవేణులును గలకలంపాటెసఁగఁ గలఁగి "అదెవిప్రభల్లూకం బరుదెంచె పదపదం" డని తొలఁగి చనుచుండిరి. అప్పుడు కొందఱు వడుగు లాతనిం గదిసిరి. అందొక్కఁడు సిగగుంజె. ఒకఁడొడిసిగడ్డముపట్టి యుయ్యేల లూఁగె. ఒకఁడు చేతికోలం గుదిచిపోవైచె. ఒకఁడు దోవతిఁ జించె. ఒకఁడు జన్నిదంబులు ద్రెంచివైచె. ఒకఁ డుర్విపై గుదికిల ద్రోచె. ఒకఁడు కన్నుల మన్నుసల్లె. ఒక్కఁడు కుక్కల నుసికొలిపె. ఒక్కఁడు తుప్పనిమొగముపై నుమిసె. ఒక్కఁడు బెట్టునవ్వుచు దాడలఁ గొట్టె. ఇట్లా విప్రబాలురు పెక్కువిధంబులఁ బెక్కులుగఁ దోఁడేటిపిల్ల లొక్కచింబోతును లంపటపెట్టినట్లు కాలకౌశికునిం గారియపెట్టుట చూచి చంద్రమతి యెల్లఱకుఁ బ్రణమిల్లి భూదేవునిమన్నింపం బ్రార్థించె. అవ్వడుగులును వారివారి వాడలకుం జనిరి.

అంతనవ్విప్రుండు కొంతభయమేది నయ్యింతిం జూచి దోవతిదూళి విదల్చుకొని. "ఓసీ! నన్నివ్వడువున నిడుమలఁ బెట్టెడి పలుగాకులఁ దలవరు లరుదెంచి దండింపకమున్న

వారిం బాఱఁదోలితివిగాదె? ఇంటివారిని లేపి దొంగబంటుకుఁ
జేయిచ్చు పాపాత్మురాలవు. నిన్నెట్లు నమ్ముదును? ఇలు
సేరినమీఁద నాపగఁ దీర్చికొనకున్న నేనువిప్రుండనే ?'' యని
పగఁ జాటుచు గృహంబున కేఁగి తలసాల నిలిచియుండె. అ
త్తఱి నెట్టయెదుట నెవ్వరో తుమ్మినంగని చింతించుచుఁ దన
శిష్యులలోఁ గర్కోటకుఁడను వటునిఁ దుమ్ముపంతముం జెప్పి
మన నాతండును గృహంబునఁ గలహంబు వాటిల్లినన్నఁ
గడుంగలఁగి, యవ్వటునిఁ బిలిచి ''నే నియ్యింతిం గొనివచ్చు
టెఱుఁగునేనినాపడఁతి నన్నుఁబట్టి మర్దించును. అది కోపించు
నేని నాగుండియ జల్లను. అది నాపాలిటఁ బెనుభూతము
గాని పడఁతికాదు. కావున నీవు ముందర నేఁగి ''అవనీ
నాథుం డొక్కఁ డీసతిని నాకు ధారఁబోసె'' నని నీ నేర్పె
ర్పడ నొడఁబడఁజేసి దానికి సంతసము పుట్టించి నాలోని
వెఱపు మాన్పు'' మని వేఁడుకొనుటయు, నాతండును వేఱు
మతంబు చింతించి యాలుమగలకుఁ గలగుండుపుట్టించి తల
పట్లుగావింపఁ జూచి, తన యొజ్జసానికడకుం జని, ''అమ్మా!
నీకొక విన్నపంబు సేసికొనవచ్చితిని. నోరు గాచెద నంటి
వేని చెప్పెద. అటుఁజెప్పిన నొజ్జచేఁజావు. చెప్పకున్న నీచే
గావు. నాకును గడుపుబ్బు తీరదు. నానాలుకపై నువుగింజ
దాగదు. నీవు వికృతవు రూపుదానవఁట. చక్కనిరూపు
దాని నొక్కఁడును వివాహంబు గాఁదలంచి, మీ మూల
ధనంబెల్ల వెచ్చఁబెట్టి, యొక్క రాచకూఁతుం గొనివచ్చి తల
వాకిట నున్నవాఁడని చెప్ప విని కోపించి దంతములు పెట
పెటఁ గొఱుకుచు, ''కటకటా! కాటికిఁ గాళ్లుసాచియు నీ

బడుగు విటతనంబులజాడ విడువకున్నాఁడు. ధనమంతయు నాలుబిడ్డలకీక వడ్డికిచ్చి, చీమవలెఁ గూడఁబెట్టి మిండల మిడత లకిచ్చుచున్నాఁడు. నేఁడు వాని వీఁపుతీట బాపి ధనంబెల్ల గ్రక్కింపకున్న నేను గలహకంటి యగుదునే?'' యనుచు రోఁకలిఁ గేలఁబూనుచుండె. ఇంతలోఁ గర్కోటకుండు తన యొజ్జకడ కేఁగి ''మీ వెఱపెల్లఁ బాపివచ్చితి. లోనికి విచ్చే యుఁ'' డని చెప్పి యాతండు లోని కేఁగునంతలోఁ దలుపు మూసి గొళ్లెముపెట్టిపోయెను. అత్తఱిఁ జింపిఱితలయుఁ జప్పి ముక్కును, దొప్పచెవులును, బిల్లికనులును, గొగ్గిపండ్లును, ముదికోఁతిముఖమును, కొంగమెడయు, గూనివీఁపును, దొడ్డి కాళ్లును, నల్లనియొడలును గల కలహకంటి యేతెంచి, ఇమ్మిటారి నెందుండి తెచ్చితి'' వని తుటారంపుమాటలాడిన, మాటలుపెఱిగి యాలుమగలు మొగములు వగుల మొత్తు లాడిరి. ఇట్లావిప్రదంపతులుపోరుటంగని చంద్రమతి ''ఆలుమగ లిట్లభిమానము వదలి మొగంబులు పగుల మొత్తులాడుదు రేని వాడలోని జనంబులునవ్వరే? పతి కెదురాడెడి పాపాత్ముఁరా లూరఁబందియై పుట్టునను ధర్మంబు వినవే? పతికి మాఱాడు సతి నరకంబునం గూలక పుణ్యగతి కేఁగఁ గలుగునె? ఇయ్య ర్థంబునం దొక్కయితిహాసంబు నెఱింగించెద వినుము. సుహృ త్సేనుండను పుణ్యపురుషునకు శర్మిష్ఠయను పుణ్యవతి సతియై యుండె. ఆయమ యాతనిఁ గుష్ఠవ్యాధి నరయవలసి వీపున నిడికొని యర్ధరాత్రంబున భూతభేతాళకలకలం బెసఁగునొక్క త్రోవం బోవుచుఁ గొఱ్ఱుపైని శవముం దాఁకి నాతఁడు నొప్పిచే నుగ్రుండై మండిపడి ''ఇనుండదయశిఖరి నలంక

రించునంతకు నీపతితల ద్రవ్యులగునుగాక ” యనిశపియించె. అందుల కయ్యింతియు వంతనొంది,” యేను బతివ్రతయగుదు నేని భానుండు మింటఁ బ్రకాశించ కుండుఁగాక” యని సంకల్పించుకొనెను. అంత దినమణియు, నుదయింప నోడి యుండె. అందున దివ మిది రాత్రి యిదియని త్రిదశుల కేనిఁ దెలియరాకుండె. అంతఁ గృపామూర్తి పార్వతీ పతి యాసతి పతివ్రతా ధర్మంబునకుఁ బ్రసన్నుండై “వరము వేఁడు ” మన నక్కల్యాణి “మొదల నీశవంబునకువరంబిచ్చి యంతట నాపతిం గావు” మనిన నక్కఱకంఠుండిర్వురకును వరము లిచ్చి కైలాసంబున కఱిగెను. అక్కలువ కంటి ప్రార్థనచే భానుండు నుదయించె. ఆమెపతివ్రతా ధర్మము నీడేరె. కలశభవాత్రి గౌతమకాంతలు పతులకుఁ బ్రియంబులు సలిపిన కతననెగాదె వెలసిరి. పతిభక్తియ సతులకుఁ బరమశీలంబు గాదె? భార్యాభర్తలు క్షీరోదకన్యాయమున కలసిమెలసి యుండఁజనదె?” యని సతీధర్మ వాక్యంబులు పలికె. అప్పు డాబ్రాహ్మణి మిగులఁ గనలి తనపతిపైని యాగ్రహం బెల్ల చంద్రమతిపై 'నిలిపి నిష్ఠురభాషణంబుల, “ఓచివ్వాలాఁడీ! నీవెవ్వర్తు? నాకుఁజక్కట్లు దిద్దుటకేనా నామగఁడు నినుం గొనివచ్చినది? నీవుచెప్పుకున్న మగనాలినడతలు మేమెఱుఁగమే? మున్నునన్నెఱుంగవుగాఁబోలు. ఇరుగుపొరుగువారి కెల్ల నాయిల్లు ఎమరుచుక్కయైయుండు. ఈవాడ గరితలందఱు ను నాపొడగాంచినంతనే గడగడ వడఁకుదురు. మృత్యువైన నాయెదుర నిలువనోడు. ననుఁ గనుఁగొన్నంతనె కడు వడంకెడి నామగని జడు పుడిపి కలహంబునకుఁ బురికొలిపితివి

గాదె? ఓసి జంత్రపుబొమ్మ! నీ వెచ్చటనుండి నాకిటు దాపురంబైతివె? యనుచుఁ జంద్రమతిం జలపట్టి తలపట్టి కురులు బిట్టూడిసి రాఁదిగిచి యీడ్చి పదతాడనంబులు సేసి మూఁతులునులిమినిచ్చలు బాములంబెట్టి గాసిఁబెట్టుచు దాసిఁగా నేలుచుండె. అద్దాసియి మనఃక్లేశంబు వాసి తనయేలిక సానియానతిఁ దలమోసి దాని మనంబునకెక్కఁ బ్రొద్దులు గడపుచుండెను.

అట హరిశ్చంద్ర నరేంద్రుఁడు తనయింతి నమ్మిన విత్తంబంతయు నక్షత్రకునిపరముగ సమర్పించుటయు న వ్వడుగు గైకొని యవ్విభుని వేవేలజాడల దీవించి, "కౌశికుని యాజ్ఞ నీవెంటఁ దిరుగుచుఁ దరువున్నదినములకెల్ల నివ్విత్తం బుబత్తెంబునకు సరిపోయె. ఇఁకఁ గౌశికుఋణంబునుఁదీర్చి సమగ్రసూనృతమహాత్మ్యముఁ జెందుము" నావుడు నజ్జన పతియుఁ జింతావ్యాకులిత సంతప్తుండై, దైవముచేఁతకుఁ బల్మఱుదూఱుచు, నిజవల్లభం బెడఁబాసిన తుందుడుకు మ నమునుడికింప దుడుకొందకుండియు నక్షత్రకు దుడుకునుడులకు దుడుకొంది తనలో నవ్వుకొని, తలయూఁచుచు, నీగురుండు నాపయిం బగఁగొని, కృపమాలి, బందెలుపెనచి, నిన్ను నాపయిం దరువుండఁ బుత్తెంచుతఱి నీకు నిచ్చలు బత్తె మిమ్మని పలుకఁడు. నాచేతి విత్తంబు రిత్తఁగొన భావ్యంబు కాదు. నీకునేనొడంబడితినే ? " యనియె. అనవుడు నక్షత్రకుఁడు "భూవరా ! నీవెంటఁ బుత్తెంచుతఱి నీచేత బత్తెంబుఁగొనుమని రహస్యంబుగఁ గౌశికుండు వల్కె. నీవొడఁబడనేల ? నిను నే వేఁడనేల ? నీవు లేదననేల ? నిను

యాచింపవచ్చిన దీనవిప్రుండ ననుకొంటివో? చదువును సంధ్యయు జపమును వ్రేల్మియు మొదలంటమాని హిమ వర్ష వాతాతపముల కోర్చి యూరూరు దిరిగి గుడిపంచల నొదిఁగి నిద్రించి పలుగూళ్లుగుడిచి గిరులెక్కి యేఱులుదాఁటి భయంకరాటవులు గడచి, కాలుగాలిన పిల్లిమాడ్కి నీవెంటఁ దిరుగ నను బంటను గొంటివో? నీవడిగి తెచ్చిన నీరసాన్నములు భుజియించి బడలితి. నేఁటి కామంచితనంబైన నీవెఱిఁగెదవనుకొంటి. నేనొందిన ప్రయాస మెఱుఁగలే వైతివి. నాకుమాత్రము దినబత్తెము లియ్యవలదే?'' యనుడు, హరిశ్చంద్రుఁడు ''గుర్వర్థంబుగ నావెంట నరుగుదెంచి తిరిగితివి గాని నానిమిత్తమయికాదు. నే నిచ్చినది పుచ్చుకొని యవల నీశ్రమకై నీగురువుగారి నడుగుము. పరదేసులకుఁ బాడుగుళ్లను చెట్లనీడలును గాక పట్టెమంచములును పట్టుపరుపులును దొరకునా? నాయొద్ద నీవెఱుఁగని విత్తమేమున్నది? తగవుమాలిన పట్టు పట్టితివి కావున మునువిశ్వామిత్రుఋణముఁ జెల్లించి యాపై నీబత్తెముందీర్తు'' ననియె. అందులకు నక్షత్రకుం డుగ్రుఁడై ''భూవరా! ఒరసిన పుండ్లపై నుప్పుఁ జల్లి కెరలఁ జేసెద వేల? నేఁ గినిసితినేని ఎవ్వరికినిఁజిక్కఁబెట్టఁ గరాదు. సాదుగొడ్డు రేఁగునేని తలపాలముదాఁక తఱుమక విడువదు. నిన్ను ముప్పోతలఁబెట్టి గుదిగుదిఁగావించి కూరాకు జేసి మేకయఱపుకూయించిననే నీ వొకవగకు వత్తువు. ఇప్పుడుచేపడిన ధనంబువిడిచి నీపజ్జఁదిరుగ వెంగలి ననుకొంటివే? ధనంబునకుం బ్రాణంబునకును లంకెకాదె? ప్రాణంబునైన విడుతుఁగాని ధనంబును విడువ. కావున నీబడుగు

వడుగును నెవ్వడువునసైన మడియించి ధననుుంగొనుము. లేదేని పైఁడిపై నడియాసవిడు" మనుడు. గడుసునుడులకు వీనులుమూసి "నీ గురుకార్యమునకై నావెంట నరుగుదెంచి నందులకు నాకు సెలవే? పరదేసులకు గుల్లపంచలుగాక సొధ ము లెటనుండి వచ్చును? పలుగూళ్లుగాక పాయసాన్న మెట్లు లభించును? ఇఁక ముని ఋణంబుదీర్ప నొండుపాయంబు లేదు. కాన ననుఁగింకరునిఁగాఁగ నేరికైన విక్రయించి నేఁటి తోఁడనంతయుం దీరునంతద్రవ్యంబుగొను" మనుటయు నట్ల కాక యనియారాజు వలపలికేలుకు తనపుస్తకపుఁద్రాట ముడివేసి పురిలోనికింజని "ఆడినమాటఁ దృణమాత్రమేని మీరని ధర్మాత్ముఁడు, రాజ్యంబెల్లఁ దృణకల్పముగ దాన మిచ్చిన నెఱదాత, బహు బలిమిచే సప్తద్వీపములు గెలిచి యేలిన శూరుఁడు, నేఁ గోరు విత్తంబిచ్చి వీనింగొనుఁడు" అని చాటించుచు నాఱేనినమ్మఁ దొడంగె. అంతకుమున్న నిజ తపస్సామర్థ్యంబునఁ గౌశికుండు పితృవనం బొకటిఁ గల్పించి జముని వీరబాహునిపేరఁ జండాలునిగా సృజించి "నీవీపురి పరేత నికేతనమున కాధిపత్యంబుఁ గైకొని నాకొడంబడిన ధనంబులేమి నమ్ముడువోయెడి హరిశ్చంద్రునివిలిచి కింకరునిగ నేలి యనుదినమును హేయకృత్యంబులు సేయనియమింపు" మననాతండట్లకాకయని మునిపుత్రుం డవనీశు నమ్మువాక్య ములు సెవులు సోఁకుటయు, నాతండు తన కుఱు వెంద్రుకలం గొరకొప్పిడి కావి చింపిగుడ్డలు తల నిటునటుఁజుట్టి, నొసటఁ జెందిరపు బొట్టుబెట్టి, యినుపయుంగరముల గుదియ చేఁబూని కల్లుబుంగఁ జంకనిఱికించుకొని, కోఱ మీసములు నులుపు

కొనుచు, గ్రుడ్లెఱ్ఱఁజేసికొని, కెలనివారల బూఁతులుదిట్టుచు, వెడపాటలు పాడుచుఁ, బదములుతొట్రువడఁ జొక్కుచు, సోలుచు "సంబళి, సంబళి. తొలఁగు, తలఁగు" మనుచు, మొగంబునఁ గల్లుకంపు పెల్లుబ్బఁ దబ్బిబ్బు పల్కుల "నెవ్వఁడా రాజెవ్వఁడా దొర?" యనుచు, నల్లనల్లన నాబాపనింగదిసి, "నీకువలసినంత ధనరాశినిచ్చి వీనిని బంటుగా నేలుదునుగాని నా కొక్కవిచార మొదవుచున్నది. ఈరాజు సుఖవాసియుంబోలె నున్నవాఁడు. పనికిపంద, చూపునకు గుఱ్ఱము, ఎనుఁబోతుపై వాన యనునట్లె జాడనున్నాఁడు. ఒఱగొడ్డంబులాడుచు, జెప్పినపనిం జేయక జాగుఁజేసెనేని ముప్పిరిగొను కోపమున నీ దుడ్డుకఱ్ఱతో వీపునఁగంతులుగట్ట మోఁది జడ్డు వాపుదును. అప్పుడు నాకుఁ గొలువుచాలునని పోయెనేని వెంటఁదగిలిపోయి వెదుక నాకు వశమగునె? నీవు రొక్కముం గొనిపోదువు" అని యోరువరాక బిట్టొకిలింత నొదువ నోటమద్యపుం గంపుతోఁ బలుక, భూకాంతుండును, "ఓరి చండాలుఁడా ! కల్లు గ్రుడ్లనుఱకంగఁ ద్రావి మత్తెక్కి యొడలెఱుఁగక నాపరువెఱుంగక పెక్కులు ప్రేలెద వేల? నీపండ్లు డుల్లంగఁ గొట్టెదను జూడుము. కులహీనుఁడవు నీవు. కట్టిన దొకబట్ట, చుట్టినదొకచింపి, కప్పనదితోలు. నినుం గనుఁగొనఁ గ్రక్కువచ్చెడిని. పాకివాఁడవు. పోఁకచేయని లేకివాఁడవు. నీకిన్ని పోకలేల? వెఱపింతయేని లేక నీవా నన్ను బంటుజేసికొని యేలఁగలవాఁడవు?" అనుడు, వాడును, "నాపై నలుగ దేవతలకైనం దీరదన నీవెంత ? దండధరుండనై జనులతప్పు లారసి చండతరంబుగ దండింతును. మాటికి

నన్నుమాలఁడని రోయనేల ? నీ జనకునికులము నాకులము నొక్క నాణెమైయుండుఁగాదె ? కౌశికునప్పుఁదీర్ప నే నెట్లున్న నేమి? నేఁదర్కింపనేల?ధనము వెచ్చించిన నాకుదాసు లెందురారు ? '' అని తర్కించెను. ఇంతలో నక్షత్రకుండును '' రాజా ! ధనమిచ్చువానికి దాసునిగ నమ్ముమంటివి గాని, సత్కులజుని కమ్ముమంటివే ? వీని కులరూపములతో నీకుఁ బనియేమి ? మాలఁడైననేమి ? బాపఁడైననేమి ? మట్టిపిల్లి యైనం బల్లెత్తి యెలుకలంబట్టినఁ జాలదె! కోరిన ధనమిచ్చి కొనరండని మొఱలిడుట నాపాలు, కొనవచ్చిన వానిం బోఁ దోల నీపాలా ? '' అని గద్దించి, చండాలు నొడఁబఱిచెను. అంతఁ జండాలుండును, ఆలుబిడ్డలు హితులు, తలిదండ్రులన్న దమ్ములు గలవానిం గాని యొరుల నేను నమ్మ నని నుడివె. అందుల కప్పుడమిఱేఁడు ''నాపైని నీకేల యపనమ్మిక? నాకు సత్యంబతల్లి, సుజ్ఞానంబతండ్రి, ధర్మంబసోదరుఁడు, ధైర్యంబ మిత్రుఁడు, శాంతియ యాలు, వినయంబ తనయుఁడై యుం దురు. నీకలఁకం బోవిడుము. నీయాజ్ఞఁ దలమోచి నీపంపు పనుల నొడఁగూర్తు''నని పలుకుటయు, వీరబాహుం డగణిత ధనంబుఁ దెప్పించి యవ్వడుగు సమ్ముఖంబునఁ గొండపాడవు గాఁ బ్రోవు వోయించి మునిసుతున కియ్య నాతం డాశీర్వ దించి, ''ఉర్వీశా ! నీవు మాకియ్యనియ్యకొనిన ధనము సర్వంబునుఁ జెల్లించితి '' వని యమ్మహీశు వీరబాహున కొప్పనసేసి చనియె. అంత సర్వగీర్వాణవరు లయ్యుర్వీశుపై నత్యంతవాత్సల్య మంకురింపఁ జండాలగృహమున నుండు నన్నాళ్లు నాఁకలిదప్పులు లేకయుండ వరము లిచ్చిరి.

అప్పుడు వీరబాహుఁ డాతని క్షత్రకులపుంగవుండనక పశుమాంస భారంబును మద్యంపుబుంగల నిచ్చి కొనిరమ్మని యిచ్చినం బుచ్చుకొని, పౌరపాచ్చెంబులేని మచ్చికం గువలయేశుఁడొక్కింత యేని గింకిరిపడక శంకింపక లజ్జింపక వాని పజ్జనఁ గల గోసంగి బంట్లం గలసి యెండఁబఱచిన తోళ్లును, కుక్కలుకఱచి పీఁకెడి డొక్కలును, ముఱికినంజుళ్లును, నఱచెడి కాకులును గల యామాలవాడం జొచ్చి ప్రేవులు వాతికే తేరఁగల్లు దుర్గంధమునకుఁ జిడిముడిపాటు నొందక చండాలునింటి కేఁగి కష్టపుంబనులు సేయుచు నన్నోదకంబులపై నాసనుంపక, మొగము ముక్కింపక రేయుఁబవలనక సేవ సేయుచుండె. వీరబాహుండును నమ్మహీపాలునియందు నెరసుల నరయుచు "సత్యంబు తెరలంజేసి ప్రతిజ్ఞాభంగంబుఁ గావించి గాధిపట్టికి సంతోషముఁ బుట్టింతు"నని నిశ్చయించి యొక్కనాటి నిశాసమయంబున నద్ధారుణీపతి యూరుపీఠంబునఁ జరణంబులు సేర్చి నారేయెల్ల మాయానిద్ర నొంది యున్న, వాని పదంబులు ముదంబున నొత్తుచున్న జననాథుం గని "ఓరీ! నీదు వినయంబునకు నయంబునకు మెచ్చి నా డెందంబు నీయందు సంగతంబయ్యెఁ గావున నిన్ను వీరదాసుండని పిలిచెద. నేఁడు మొదలు నాయాజ్ఞవాఁడవై, యీ ముద్రగుదియఁబూని, యీవీటిపరేత నికేతనంబున కాధిపత్యముఁగైకొని పీనుగులఁ గాటికిఁగొనివచ్చువారివల్ల మాడ పాతికలంగొని నాకిచ్చి పిండాశనంబుఁదిని బ్రతుకుచుండు" మనుడు, వీరదాసుఁడు నిజాభిమతంబున కియ్యకొని ముద్ర గుదియంగొని మ్రొక్కివీడ్కొనిపోయె. పిదప నాతండెల్లభూత

వ్రాతంబులను, శాకినీ మోహినీ పిశాచంబులం బట్టి కొట్టి, " నేఁడాదిగా మీరత్యంతసంభ్రమంబున నేఁగి వీరబాహుని గృహంబునఁ బగలెల్ల వెట్టిఁ గట్టెలు కొట్టితెచ్చుట లోనగు నూడిగపుంబనులు సేయుచు మాపటివేళలనిటవచ్చి గస్తుదిరిగి యీకాటినిఁ గాచుచుండుఁడు. ఈనాయాజ్ఞనుల్లంఘించితి రేని యీదుడ్డున దండన మొనర్తు. ఇన్నాళ్లవలెఁ గాక యింతటి నుండి మీకు విచ్చలవిడి మెలఁగరాదు. ఓ బ్రహ్మరాక్షసు లారా! మదీశ్వరునకుఁ జండాలుఁ డనక నిచ్చలుదీవించి రం" డని నియమించి, నిట్టతాడియు ఁబోలెనున్న యొక్క బేతాళునిం బిలిచి "నీవింక నాకొలువుకాఁడవై వీరందఱిచేఁ బనికొనుము. ఇచ్చోనొక్కమంచె పెట్టించు" మనిన నతండట్ల కాకయని చాఁగిలిమ్రొక్కి యతిత్వరితంబున మంచెఁగల్పించి విచ్చేయుఁడని విన్నవింప నప్పంచజనాగ్రగణ్యుం డమ్మంచెపై నిలిచి యా రుద్రభూమికిఁ గాఁపై యుండె.

ఇట్లుండఁ గాలకౌశికునింటఁ జంద్రమతి హంసనారి యనుపేర దాసియై, దాసీకృత్యంబుల నత్యంతదీనయై, విలాసంబెడలి, యిడుమలంబడలి, మాయలంజిక్కి యాఁకలి దప్పులసొక్కి, కఠినోక్తులం జిక్కి, మిక్కుటంబగు ద్రొక్కట చే మనంబువొక్కి, చింతలంగుంది, యుడుకులంగంది, చింతలవ్రేఁగి, హృదయంబుగ్రాఁగి, వెలవెలంబాఱి, విభ్రమంబులం దాఱి, విశ్వేశుదూఱి ద్వాదశమాసంబులు కలహకంటి మనసురా మెలఁగుచుండె.

అంత నొక్కనాఁడు కాలకౌశికుఁడు లోహితాస్యునిఁ గనుఁగొని "ఓరీ! ఈరీతిని రేయుంబగల్లును బానిస చంకను

నిఱికికొని యేపనిచేయనీయకున్నావు. నినుం గనుగొన్నం గోపంబుగలుగకున్నె? ఈతొత్తుకఅవుల గుడిచాటుకాఁడవై యుండఁజనునే? వీపెల్ల దద్దులుగట్టనడపక కాదింక'' నను చులోహితాస్యుని జడవట్టియీడిచి చెంపలుగొట్టి తిట్టి తొడలును జెవులును నెత్తురులుబ్బ నులిమి ''నేఁడుమొద లీవాఁడలోనఁజదివెడి నీయీడువడుగులఁగూడి బుద్ధితప్పక నిచ్చలు నరణ్యంబునకుం జని కుశసమిత్పర్ణంబులును తులసిపత్రియుఁ బెయ్యదూడకుఁ గసవును గొనిరమ్మని నియమింప, బాలుఁడు వెలవెలఁబోయి యేడ్చుచుఁ దల్లిం గదిసి పదంబులపై వ్రాలినఁ దనయునిఁ జంకనిడికొని చంద్రమతి, ''కట్టా! పట్టభద్రుని పట్టియగు నీకిట్టికట్టడియిడఁ గాలకౌశికున కెట్లు నోరాడెనో! భాగ్యరేఖ గలదానికిం బుట్టక నాకేల పుట్టితివి? నినుఁబాసి నిముసమేని నిలువంజాల నింకేమి సేయుదాన? మనయొడయుని పనుపుసేయక మానరా''దనుచు వెచ్చ నూర్చుచు, దుష్టమృగపక్షిభూతవ్రాతంబులవలనం గుమారునకుఁ బ్రాణభయ మొదవకుండునట్లాశీర్వదించి యెల్లవేల్పుల వేఁడి దక్షిణకరంబున నొక్క రక్షాబంధనంబుసేసి పంపె.

అట విశ్వామిత్రుఁడు తనమంత్రశక్తిచేఁ దక్షకుండనెడి పన్నగరాజు నాకర్షించి ''ఓయితక్షకా! మాకొక హితకార్యంబు సేయుము. హరిశ్చంద్రపుడమిపతిని గలఁచి బొంకింప ననువుపడక నున్నవాఁడు. ఆ నరపతిసుతుఁ డరణ్యమునకుం జనియున్నవాఁడు. వానిం గఱచి నిర్జీవితుం జేసిర'' మ్మనియె. తక్షకుండును దత్క్షణం బచ్చటికేఁగి పితృవన సమీపంబున గుంటదరిని మఱ్ఱిచెట్టుక్రింద పుట్టం బ్రవేశించి

యుండె. ఆ తక్షకుచేఁత కనుకూలముగ నగ్గాధేయుండు తన శిష్యులం బిలిచి వనంబునం జరియించు నా రాజనందనుని సంగడీఁ గూడి వానిం బ్రేరేచి తత్క్షణంబ తక్షకు క్రూర విషాగ్నిశిఖలపాలుగాఁ బడఁద్రోచునట్లు పనిచె. అవ్వడుగులును దడయక లోహితాస్యుఁ గని కడు మధురఫలాదులం గొంపోవ నోడఁబఱిచి వానిం దోడ్కొనిచని ఫలదర్భయిధ్మ తృణాదులం గోసి కట్టగాఁగట్టి వానిశిరంబునం బెట్టి చనుమనిరి. వాఁడును మొగముచెమరింపఁ గూఁకటి చీకాకుపడఁ బొడవగు డప్పిచేఁ గుత్తుకయెండి దడచే వడఁకుచు చెలువమెడల నడుగులు తడఁబడ నల్లన నడచి బిట్టలసి యవ్వట విటపిమూలంబునఁ దలమోపుఁ జేర్చి నచ్చటి తటాకతోయంబులం గ్రోలి కొంతదడవు వటచ్ఛాయ పవ్వళించియుండ, నవ్వడుగులు వానిం దలఁపింప వాఁడును మేల్కాంచి యాకులంగోయ నొక్కపాదంబు పుట్టపైనునిచి యొండుపాదంబు విటపిపై నూఁతగాఁద్రొక్కి కొంతనిక్కి, వాలుకొ మ్మొక కేలవంచి యొండు కేలుసాఁచి యందుకొని కోయ గమకించు నాలోన నవ్వాతూలాశనస్వామి నాల్కలు పెల్లార్చుచుఁ బుట్ట వెడలి యాలోహితాస్యు నదరంటఁ గఱచె. అంత నా గాపట్టి, హా మాత! యనుచు మూర్ఛనొంది భూమిపై వ్రాలె. మఱియు రూపఱియె. మునిపుత్త్రులది చూచి మహాద్భుతంబంది, "వీఁ డహీంద్రవిషవహ్నికీలల జీవములం దొఱంగక, యల కాలకూట మహాగరళంబు మ్రింగి మూర్ఛితుఁ డైన శివునివడువున నున్నవాఁడు. మైచేవయు మోముకాంతియు నొకించుకేనియుఁ జెన్నఱియుండవు. నిప్పుఁ జెద లంటునే?

లోకైకవినుత కాంతామతల్లియగు వీనితల్లి వలచేతిరక్ష కట్టెడివేళ నేమంచు దీవించికట్టినదో?'' యనుచు నతిత్వరిత గతిం బురంబున కరిగి, యార్తారవంబు సేయుచు సర్వార్త మార్తాండకులచక్రవర్తిదేవికిం దెలియఁ జేసిరి. అమ్మెలుఁగుఁ బోడియు గుండెలవియ, మెండుకొను వేదనం దూలి సోలి యొప్పతి తెప్పతి పలవుచుఁ దలంబుగాని కొందలంబునకుఁ దావలంబై యేడ్చుచు, ''హా కుమార! నా కిటమీఁద దిక్కెవ్వఁగు? బ్రదుకఁ దెఱు వెద్ది? పుట్టక పుట్టక పుట్టిన పుట్టుభోగియగు నాపట్టిపయిం బుట్టభోగి కిట్టిపగ బుట్ట నేటికి? దైవజ్ఞులు నీ పుట్టిననాఁ డిలయెల్ల నేలెదవనుచుఁ బల్కిరి గారె? అల్లవి కల్లలయ్యెఁగా!'' యనుచు నుల్లంబునఁ దల్ల డిల్లి, పుడమిపైఁబడి మూర్ఛిల్లి, యెట్టకేలకుం దెలివొంది, బిట్టువగంబొంది, ''పతిఁబాసియు నీకతన మతిలోని దుఃఖ మెల్ల నొకవైపునకుఁ ద్రోసి, దిగులునుమఱచి, ధృతినాత్మ నిలిపియుండిన నాకిఁక నేగతి? ఆకాకోదరంబు నీపాలిటి కకాల మృత్యుదేవతయై నినుఁ గవియుతటి నేకరణిఁ దల్లడిల్లితో? కాలగతిచే నాకులమంతయు దిక్కుమాలి నేఁటికిఁజెట్టున కొకపక్షియై రాలిపోవలసి వచ్చెఁగా! భాగ్యసౌభాగ్యవతు లైన పడఁతులుండ సకలదుర్లక్షణముల కాకరంబైన నా కేటికిఁ బుట్టితివి?'' యని పెక్కుగతులఁ బలవుచుండె. ఇ ట్లడలు భూపాలు వనితపై నవ్విప్రవనిత కడుంగినిసి, ''ఓసీ! ఈ సందెప్రొద్దున నమాంగల్యమొదవ నేల యేడ్చెదవు? పుత్త్రిని నెచ్చటికో తోలఁగఁబెట్టి యుగ్రభుజంగంబు కఱచిన దని వెడయేడ్పు లేడ్చుచు నిల్లునుఁ బెళ్లను నొక్కకొలికికిఁ

దెచ్చి వేసాలువన్ని వెదకుసందున సురుంగఁ జూచితివే? నీ కంటె నేనెఱజాణఁ జమ్మ. మా సామ్మెంత విసమైనదే? ఈతీరుగాఁ బని కొడలు దాఁచుకొని యింటి కేముఖము పెట్టుకొని తిండికి రానున్నావు? పనులేల చేయ వన్నందు కీ పన్నాగము పన్నుచున్నావు. నీపనులు చేయువా రెవ్వరింక లెమ్ము. ఇటురా, రమ్ము'' అని యీలీల దురాలాపంబులు పలుకు నక్కాలకౌశికుని యాలిం గనుంగొని యా లోలాక్షి యాఱనివగపును లోలోన నడఁచి ''తల్లీ! ఉల్లమున నొండు తలఁపు మానుము. నాపాపఁడు విసమెక్కి యసువులు దొఱంగి యున్నవాఁడో కొఱప్రాణంబుల నున్నవాఁడో యెఱుంగ రాదు. వానింజూచిరా నొక్కని బంపుము. వాఁ డీల్గక మున్న యౌషధం బిప్పించి పుత్త్రభిక్షమిడు'' మనుచు నడు గులపై వ్రాలి లేవకున్నం గని, కలహకంటి తేని కలువ కంటిం దొలఁగుమని తలనొక్కింతఁద్రోచి ''తొలుతటి సొమ్మ నకుఁ దోఁడింక కొంతగెలువఁజూచెదవే? కట్టెలు దెమ్మన్న నొడ లెఱుఁగక తిని కావరముపట్టి నీపట్టి పుట్టల నెట్ట నేల? పుట్టభోగులకు వాకట్టఁగలమే? నీపట్టిని మనుప మా కేమిపట్టె? నీచేయునట్టి పను లెల్లఁ గొఱకాక తీర్చి ప్రొద్దువోయినమీఁదఁ బోయి నీసుతుని సుద్దియెఱింగి ''రమ్మని కనికరం బాత్మ నంకురమొంద నుడివె. ఆ సాధ్వియు నమ్మదితయానతి మీఱ మేఱగాక మాఱుపలుకునది లేక యట్లకాకయని పను లెల్లఁదీర్చి భక్తిమై నక్కలహకంటిపదంబు లొత్తుచుండె. బ్రాహ్మణియు బెట్టునిట్టూర్పులు నిగుడించుచు గుఱువెట్టి బాకినోరు దెఱచి కలవరించుచు సుప్తింబొందె. అప్పుడప్పల్ల

వాధర యల్లనలేచి తన శోకాంధకారమునకు బంధురంబగు నంధకారము తోఁడుగాఁగఁ బతిభక్తియే తనకుఁ దోడుగా నవ్వడుగులు సెప్పినచొప్పున నరిగి, వటభస్మపుంజంబు కాళ్ల కడను, వల్మీకంబు తలాపికడనుంచి కన్నులరమోడ్చి నిద్రించు విధమున నున్న నందనుంజూచి డెందంబును ముందలయు మొగంబును మోదుకొని మూర్ఛిల్లి ధరణిపైఁ బడి కొంతవడి కింత దెలిసి, "లోహితాస్యా! మారా! కుమారా! సుకుమారా! నిర్వికారా! సౌభాగ్యలక్షణాకారా! చక్రవర్తి కుమారా! మెఱుఁగారు నీమేను కఱవుదీర నక్కునఁ గదియింప కున్న నీచిన్ని చెక్కులం గదిసి చుంబింపకున్న, నిముసంబైన ప్రాణము లుండవు. ఎచ్చటనుండినను బిలిచినంతనె యెదురుగా వత్తువు. నేఁడేటికి రావు? పలుమఱు నినుం బిలువంగఁ బలుకవేల? నాపయి నీకుఁ గల మరులెందుఁబోయె? వడుగులచే నీవార్త విన్నంతఁ దడయక నే రానందున నలుకచేఁ బలుకవో! మేడలందు రత్నపుటుయ్యెలలపై బాలికలు జోలలుపాడ నిదురించుచు సుఖంబుండెడు నీవు నేఁడీయరణ్యంబున నీనేలఁబడి నిద్రపోనేల? నిన్నేమందు? ఏమందుచే నీవిసంబుమాను? ఎట్లుతీఱు నాక్షంము? నాకెవ్వరీఁగలరు నాచందు? ఎవ్వరిమోముకందు? విధి నేమందు?" నని పలవించి, కొంతవడికి "వీనియొడలఁ బ్రాణంబు డాఁగియున్నట్లు తోఁచెడిని. పున్నమచందురుఁ బోలె రాజిల్లు నీవదనము వాడు జెందకున్నది" యని చర్చించి మఱల భావించి "ఇది ర్మోల వలవనియాస? చచ్చినవారలు మగుడ వచ్చుటయుఁ గలదే?" యనుచుఁ దనుఁదాన యూఱడించుకొని ధైర్య

వివేకంబులం దెచ్చికొని, యిఁకవీనింబుణ్యగతికిఁబోవ నుచిత సంస్కారం బొనర్చి, కలహకంటకి మేల్కొనకమున్న చని, యుచితకృత్యంబులు సలుప గమకించి, పట్టెందనమూఁపునం గట్టుకొని రుద్రభూమింజొచ్చి యందొక్కెడెసఁ బుత్త్రుని డించి, శుష్కకాష్ఠంబులం గొన్ని గడించి కూర్చి పుత్త్రునందిడి, యింగలంబుతగుల్పంబూని, చేతులాడక, నిజహస్తంబులు మోమునం జేర్చి, పటురవంబుచెలంగ నెలుంగెత్తి యేడ్చుచుండె.

ఇంతలో నప్పరిసరంబునఁ గాడుగాచుచున్న హరిశ్చంద్రుండు "నాకును నిద్రాహారములకును ఋణముదీరి యెంత కాలమైనది. నాయర్ధాంగలక్ష్మియు సుగుణవతియునగు చంద్రమతిం గొడుకుతో దాసిగా నొక్కని కమ్మిననాఁడె నాకును నాసౌఖ్యమునకును ఋణముదీరె. మొండినై ప్రాణావశిష్టుండనై యున్నవాఁడ. అసువులం దొఱంగితి నేని యీపశుఘాతకునికడ దుఃఖము లనుభవించువారెవరు? అక్కటా? ఒక్కనిపంచదాసియై యల్లాడు నిల్లాలికై కుందుదునా? సౌఖ్యంబునకుం బాసి పొట్టకై రోసి పరితపించు సుతునకై వగతునా? ఈనీచపు కాటికాపరితనమున కేడ్తునా? కష్టములన్నియు నన్నే వరియించినట్లున్నవి. నాదు పాడుప్రాణము లీయొడలినుండి వెడలఁజాలకున్నవి. నిర్భాగ్యుఁడనైన నేఁజచ్చిన వెనుక నీకష్టములకుఁ దా వెక్కడ దొరకునో? హా! నా గారాబుపట్టి నిట్టిబెట్టిదపుదాస్యంబునకు మందమతినై యొప్పగించితినిగాదె! దైవంబు విపరీతంబగుతఱి మతి యేమిసేయవలఁతి? నావంత యంతకంతకు మితిమీఱి యంతరంగంబుఁ

గోయుచున్నది. ధైర్యంబును మఱింత మాయుచున్న'' దని కొంతవడికి వంతఁదొఱఁగి ధైర్యం బవలంబించి "ఇఁక దుఃఖించి కార్యమేమి?'' యనితలపోయుచుండ, పనవి పనవి విలపించు నొకయేడ్పుటెలుంగు విని, "అక్కట! ఇక్కడ నేకతంబ నొక్కకాంత దురంతచింతాక్రాంతయై వాపోవుట వినంబడియెడిని. దీనిం గనుఁగొనఁజను'' నని ముద్ర గుదియ భుజంబునంబూని, ఖడ్గంబుఁ గటిచేలంబునం గీలించి, కులగిరిపైనుండి మహీమండలంబున కుఱుకు పంచాననము పగిది యారాజపంచానన మామంచెపైనుండి డిగ్గి యల్లన నేతెంచి మిగుల వగలంబొగిలి వాపోవుచు మొగిలులోనఁ దోఁచు చంద్రకళభంగి నున్నచంద్రమతికట్టెదుర నిలిచి, "కట్టా! ఈనట్టనడు రేయి నీకిట్టి నెగు లేకతంబున వచ్చె? మఱుఁగువెట్టక చెప్పుము. నీపేరేమి? నీమగనిపేరేమి? నీకిర వెద్ది? ఈబాలుం డేటికి మృతినొందె?'' ననుడు దీనవదనాంబుజము వ్రేలవైచి యశ్రుధారలొలుక నవ్వాలుకంటి గద్గదకంఠియై, "ఓనరలోకవంద్యా! నాపతి తనఋణంబుఁ దీర్పననువుగానక నన్నొక విప్రునకుం బోకడపెట్టె. ఆమ్మహీసురునింటదాసియై వసింతు. నను హంసనారియందురు. ఈతండు నాకుమారుండు. భూసురునిపనుపున వీఁ డడవికిం గట్టెలకై వచ్చి పన్నగముచే దష్టుఁడై యీల్గె. అనఘా! నీవెవ్వండవు? నాదుఃఖంబడఁప విచ్చేసిన విశ్వనాథుండవో? ఈపరేతభూమిని విహరించు భూతపతివో? విషవైద్యమిచ్చి మత్సుతుని సజీవుంజేసి నను రక్షింపవే?'' యనుడు నారాజపురందరుం డమ్మగువం దనకులసతి యగుట

నిక్కువంబుగ నాత్మఁ దెలియక చంద్రమతిం జూచి "నే భూతపతిగాను విషవైద్య తంత్రంబు నెఱుఁగ. నాయేలిక వీరబాహుఁడీ పరేతనికేతనముం గుత్తగాఁ గైకొని రేయుఁ బవలునునికాఁడుగా వంగ ననుం బనిచె. నాపేరు వీరదాసుఁడు. నట్టనడురేయి నీపట్టిం దెచ్చి ననుం గానక యిచ్చట నునుపఁ బాడియే ? నెలఁతవగుటం జేసి నిన్ను మన్నించితిఁ దక్కొరుఁడైన శిరంబు ఖండింతు. సొదపేర్పఁ నగునంత చోటికి నొక మాడ దెచ్చి నాకిచ్చి పీనుఁగుం దెచ్చి కాల్తురు. ఈచొప్పు దప్పక యొప్పికొని యిమ్ము, లేదేని తొలఁగిపొ" మ్మనవుడు నవ్వెలఁది. "నేనిరుపేదరాల. విప్రునింటనూడిగము చేసికొని గ్రాసవాసంబులు జరుపుకొనుచుందు, సిరిగలదానిఁబోలె నన్ను మాడ వేఁడెదవేల ? నాపై నొకకొంత కరుణసేయుము. అక్కట! నాఁకు నిక్కముగఁ గానికాలము. విశ్వంభరాచక్ర మెల్ల నవక్రముగ నేలి యేకచ్ఛత్రాధిపతియై సామంతభూకాంతుల నశ్రాంతము దనపాదాక్రాంతులం జేసికొని రాజిల్లిన చక్రవర్తికి సుతుండైన యీబాలుఁడు చేరెడు నేలకు నోచుకొనకపోయెనే! గోరుచుట్టుపై రోఁకటిపోటు దాఁకినట్లాయె. అనఘా? తోడువైనవారల నెడసి పుడమిని మనియుండ నేమిటికి? కౌశికుమాయ నన్నలఁచిపోనీక పట్టి యిప్పగిది కాలఁ బెట్టి ప్రాముచుండ నిన్నననేల ?" యని చాయగానాడిన మాట లాకర్ణించి, నృపపుంగవుం డక్కురంగనయనం దన భార్యగా నెఱింగి, "యేలమోముగంద నేడ్చెదు? వానికి జీవిత కాలము సమాప్తమయ్యె. పోయినవారి వెంటఁ బోవుటఁ గలదే? మిన్నకుండు" మని యెన్నియో భంగుల నూరటఁ

బలికి, "వీఁడేడుదీవులనేలు పట్టభద్రుని కూర్మిపట్టియఁట తాను పట్టభద్రుని దేవేరియఁట! ఒక్కమాడయైన లేదఁట! దీని నెట్లునమ్మవచ్చు? మాయేలిక చెప్పినచొప్పునఁగాక నీ పేదతికముతో నాకేమిపొత్తు? ఎవ్వరికైన మాకు మొగమోడంగ రాదు. హరిపూజకుం దొలంగి యంత్యజుఁగొల్చికులాభిమానంబులం బోగెంటి, యీవల్లకాటి కధికారంబునొంధిన కాటిపాపనికి నీపై నేల కరుణగలుగును? నీకొండుపాయంబులేకున్న మాకిచ్చుమాడకుఁజెల్లుగాఁగనీమగళంబున వెలుగొందు కంఠసూత్రముననున్న మినుకైన నిచ్చి నీసుతుని దహింపు" మనుటయు నానాతి యప్పలుకుల కులికిపడి తన్నుఁదానెఱుంగక మహీతలంబునకు వ్రాలి కొంతవడికిఁ దెప్పిరిలి, తనమెడనున్న మిను కన్యపురుషుల కేరికెన్నండును లోచనగోచరంబు గాదు. కావున నాతనిఁ దనపతిఁగా నెఱింగి తనప్రాణేశ్వరు చరణకమలంబులకు మ్రొక్కి "హా, నాథా! నీపుత్త్రి లోహితుం జూడుము. మునునీయూరుపీఠంబున నిద్రఁజెందిన పగిది నేఁడీచితిపైఁ బడి దీర్ఘనిద్రనున్నవాఁడు. ఒకమరియైన మేల్కొనఁడు. సత్యప్రియా! పాదాక్రాంత భూకాంతుఁడవగునీ కీకాటికాపరితనం బాయెఁగా! దురవలోక్యంబగు నీప్రేతాలయమే యయోధ్య యయ్యెఁగా! నులకత్రాటిమంచెయే నీకు మించిన సింహాసనంబయ్యెఁగా! ఈజంబుకారావములే వీణానాదములాయెఁగా! ఈభూతభేతాళ పిశాచంబులే నీకు భటసముదాయం బయ్యెఁగా! నీరాజసంబెందుఁబోయె? నీతేజంబెందుడాగె" ననుచుఁ దనజీవితేశుఁడున్న దుర్దశకు బిట్టుకలఁగి విలపించుచుండె. అమ్మహీకాంతుం

డును బుత్త్రశోకంబునంగుంది' "ఈమన్నీఁడు పిన్ననాఁడె సత్కీర్తిఁ గన్నవాఁడు, పదవికిరానున్నవాఁడు, కట్టా! ఇఁ కేమన్న రాఁడు" అని మూర్ఛనొంది కొంతవడికిఁ దెలివొందె. అప్పు డక్కాంత, "భానుకులేశ! మన మిద్దఱ మిప్పగిది ధృతిదూలి యీగతి నేడ్చుచుంట బుద్ధికాదు. ఇదె ప్రొద్దు వేగుజామయ్యె. ఇనుఁ డుదయింపకమున్న నేఁ జనకున్న నాయేలికసానిచేఁ జావుసిద్ధము. కానున్నది కాక మానదు. ఇఁకఁ గాఁగల కార్యంబునకుఁ దెఱఁగెద్ది?" యనియె. అందులకన్నరపతి, "ఓరాకేందుముఖి! స్వామికార్యం బనివార్యంబు. నిన్నేలు వసుధామరునడిగిమాడఁదె" మ్మనుటయుఁ దనప్రాణనాథు సత్యంబున కలరి తనయుని భర్తకడసడి పురవీధి నేఁగుచుండె. కౌశికుం డీసంచు నెఱఁగి తరలాక్షిం జంపింపఁదలఁచి యొక్కతస్కరుఁ గల్పించి వానికిఁ దగునుపాయంబు గఱపి చనియె. వాఁడు నందులకుంగొలందియగు వేసం బలవరించి కొని, యవ్వారణాసిపురాధీశు నగరునకుఁ గన్నంబు వేసి, హర్మ్యాంతరంబునఁ దూఁగుటుయ్యెలలో దాదిప్రక్క నిద్రితుండైన రాకుమరుం జేరి కుత్తుకఁ బిసికి మణిమయంబులగు తొడవులంగొని తడయక వెడలి చంద్రమతివచ్చు తెరువునకడ్డమైనిలిచి "ఈచీఁకటివేళ నీవేల నొంటిమెయి నేఁగెదవు? కల తెఱంగెఱిఁగింపు" మనుడు, నయ్యింతి వంతనొందుచుఁ దనదువృత్తాంతం బెల్లఁ జెప్పుటయు, వాఁడు లేనిదయఁదాల్చి "నీవీచందంబునఁగుందనేల? నీవునాసోదరి" యనుచుఁ దనచేతి పసిబిడ్డనితొడవు లన్ని ముడిగట్టి యందిచ్చె. ఇంతలోఁ దలవరులు తమఱేనియానతిబూఁని వెదకుచురా, న

చ్చోరుండు వారికిమున్నె "దొంగఁబట్టితిరం" డని తలవరుల లోఁ గలిసి, య త్తలిరు బోఁడి పెడకేలుఁ గట్టి మొట్టుచు బెట్టుతిట్టుచు భీషణుఁడను మొదలితలారి ద్రోలఁబెట్టి సురింగె. అంతట భీషణుం డతిరోష సంతప్తుఁడై చంద్రమతిని నిప్పులు గన్నుల నిగుడ నీక్షించి జంకించి తనచేతివాలు ద్రేయ నుంకించి శంకించి తనయేలిక సమ్ముఖంబునఁ బెట్టె. అతండును జంద్రమతింగని, "అక్కటా! నిన్నెవు రాత్ముఁడిటుసేయఁ బుత్తెంచె. తోడవులపైని వాంఛగలదేని నీకునేనిత్తునుగాదె! ఇందులకై సుందరాకారుని నానందనునిఁజంప నెటుఁజేతులాడె? మున్నెన్నండేని యిట్టివి గన్గొన్నదియులేదు. విన్నదియులేదు. నీకతనఁ గ్రొత్తలుపుట్టె. "పురుషులకంటె నతివలకు సాహసం బాఱుమడుంగు లెక్క" డనెడి నీతివాక్యంబు నిక్కంబయ్యెఁ గా! యనికోపించి భీషణుం గనుంగొని, "దీనిం జూచినఁ బాతకంబౌదవు. పడఁతుక నాక యీబాలఘాతినిఁదలఁద్రెవ్వ నేయుమని వీరబాహునకుం జెప్పుము" నావు డట్లకాక యని భీషణుండు నత్యంతరోషంబున జంద్రమతిం దోడ్కొని రాజ వీధిం బోవుచుండఁ బౌరకాంతలు దానింగని "అయ్యయో! ఈపడుచు రాచపట్టంబట్టి గిట్టింప నెట్టన నెచ్చటినుండిమృత్యువై వచ్చెనో!" యనువారును, "అక్కటా! ఎక్కడనేని యిట్టి విపరీతము వింటిరే? తొల్లి నాఁడుదొంగలున్నట్లు వినము. ఈపురిలోనం గలిగిరి. ఇట్టి బూమెలు గలవే?" యనువారును, "ఎంత యపరాధ మొదవినను గొంతదయచూపక యింతిం జంపుట పాడియే?" యనువారును, నొక్కొక్కచోనుండ నప నమ్మికమఱియొకచోనుండును. ఈమానవతికెట్లు నిందయెసఁగె

నోగాని, యిమ్మేటికోటలుదాటి, యీగోడలెక్కి తాళంబు లెడలించి కవాటముద్దెఱచి, జాగిలములవాకట్టి యీరాపట్టిం జంప దీనికివశమగునె? కన్నగాఁడెవ్వఁడో తెంపుసేసి శిశువుం జంపి తోడవులంగొనిపోవుచుండ తలవరులుగూడి ముట్టినం జేయునది లేక చోప్పుపుట్టఁగ నాసొమ్ము లమ్ముదితపైఁ గట్టివైచి సురిఁగియుండవచ్చు. మృగయుఁడు నిర్దయుఁడై క్రూర శార్దూలంబుల నేణంబులం గూల్చునట్లువివేకి యగునృపుఁడు దోషుల నిర్దోషులం ద్రుంచు. ఇందుననే "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మని విద్వాంసులు నుడువుదు" రనువారున్నై పలువురు బలుదెఱఁగుల బలికిరి. భీషణుండును నక్కీరవాణిని వీరబాహుకడకుం గొనిపోయి వసుధేశుం డానతిచ్చినచందము దెలియఁ జెప్పి చనియె. వీరబాహుడును దనచేనిముదలఁ బూని నిజకింకరులం గని యీబాలఘాతిని రుద్రభూమికింగొని చని వీరదాసునిచేఁ జంపింపుఁ" డనుటయు, వారును వీరదాసుని ముందఱఁబెట్టి క్షితివరునానతియుఁ, దమ పతిపంపును జెప్పిన నదివిని వీరదాసుఁడు వెఱఁగంది దీనుండై "ఆహా. విధి చేఁతలం గడవఁగలవారెవ్వరు? శరణని వేఁడు వైరులఁ గృపామతిం బ్రోచునేను కులకాంతను వధియింపఁగావచ్చె! నాకెట్లు సాఁగు?" ననియశ్రుపూరితనేత్రుఁడై మోమరవాంచి యున్న యన్నరేంద్రునకుఁ జంద్రమతి "నాథ! నీవెఱుంగని ధర్మంబులుగలవె? స్వామికార్యం బనివార్యము. తొల్లి భూదేవి స్వామిద్రోహ మమితభారంబనుచు ఖగవాహనుతోడం బలికెఁ గాదె? అదియుఁ గాక బాలఘాతినియనెడి నిందం బొందితి. కానఁ దెంపుఁజేసి నాతలద్రెంపుము. ఇఁక నెడసేయ నేల?" యని

తనప్రాణేశ్వరు పదంబులకెఱఁగి ముదంబునఁ బ్రదక్షిణము సేసి కేలుమొగిడ్చి పద్మాసనంబునం గూర్చుండి, పద్మినీవల్లభుపైఁ జూడ్కులునిలిపి, "సకలలోకైకవంద్య! నాకు జన్మజన్మంబుల సతత సత్యశీలుఁడగు హరిశ్చంద్రుఁడే పతిగానొనర్పు" మని ప్రార్థించి నిజవల్లభునుల్లంబునం జేర్చియుండుటయు, నమ్మహీపాలుఁ డవ్వాలుగంటిం గనుంగొని "ఈమూఁడుపేద నేనేమని చంపువాఁడ? స్వామియాజ్ఞ దుర్లంఘ్యమే యయినను సంగరాంగణంబున విపక్షులను శిక్షింప దక్షంబై యుండు నీకౌక్షేయకంబునఁ గులాంగనయుత్తమాంగంబు ఖండించి స్త్రీహత్య కొడిగట్టుకొన మనసొప్పకున్నది. గోమాంసభక్షణమునకు శంకింపక శిరశ్ఛేదనము గావించుటయే నిత్యకృత్యముగాఁ గల చండాలప్రభునకుఁ గింకరుఁడ నయి వల్లకాటి కధికారము వహించియున్న నాకు దయ యెక్కడనుండును? అనాథరక్షణ ప్రశస్తంబు లయిన యీహస్తంబులింకను నెన్ని యసువుల వధింప నొడిగట్టుకొన నున్నవో యనుచు దైన్యంబు విడిచి, ధైర్యంబుఁ బెంచి, గాంభీర్యంబు నాటించి, శౌర్యంబుఁ బ్రకటింపఁజేయుచుఁ దన యాభీలఖడ్గంబు నొఱవాయఁ బెఱికి చంద్రమతి కంఠభాగంబునం గదియించి తెగవ్రేయ గమకించు నంత, గాధిపట్టియు నెడఁజొచ్చి దిగ్గన ఖడ్గంబుఁబట్టి, "నరేశ్వర! ఇట్లు పెంపఱి తెంపరివై కులసతిం జంపుటయు నొక బీరమే? అట్టి యగ్గలిక యెగ్గని నీగురుండుగ్గడింపడె? ఇట్టిసాహసంబేల నీకు? నినుంజూడఁ బాతకంబగు. వైరులపై వాలు నీ వాలుచే వాలుఁగంటుల ద్రుంపఁజనునె? పురుషులకు ధర్మార్థ కామమోక్షములు నీఁగలిగిన సాధ్వీమణుల నినుపములికికిమ్మని

నీగురుఁడు వసిష్ఠుఁడు నియమించెనే ? అట్టి భార్యకైఁగాదె శూలపాణి దక్షునిం గినుకతో వధియింపఁగలిగెను. అప్పరమ శివుఁడు నీకంటె బుద్ధిహీనుఁడె ? సతిలేని సదనం బదియేల ? సౌఖ్యంబులేల ? సుతులేల ? సంపదలేల ? నీకుఁగలుగు సకల పుణ్యంబులును సకల ధర్మములును సద్గతియు నా సతివల్లనే కదా ? కావున నీయాగ్రహబుద్ధి విడువుము. నీ వివేకం బే చెట్టునకుం గట్టితివి ? నీవు దానవుండవుగాక మానవుండవే ? కటికవానికైనఁ గొంత కరుణారస మబ్బుఁగాదే ? మానవాధీశ ! పావనంబగు భానుకులంబునంబుట్టి, ప్రశస్తంబగు నీతివర్తనంబుడిగి దీనగతి వెలివాడవానికి సేవజేయుచుఁ బ్రేతవనసీమను వసించుట నీకు ధర్మముగఁదోచెనే ? నామాట వినక నందనుం జంపుకొంటివి. నీయాలుం గోలుపోయితివి. ఇప్పుడు నీతిమాలి నాతిఁ జంప సమకట్టితివి. మానక నీదురభిమానమును బెంచెదవు. నామాటఁ గైకొని నా కుమారితలగు మాలెతలను వరియించి నీసుతు ప్రాణంబును, నీసతి తోడి పొందును, నీ సముజ్జ్వల రాజ్యంబును బడయుమా!” యనిన నమ్మానవేంద్రుండు మునీంద్రుంగని పక పక నగి, “మిమ్ము నతకరించుట దోసమేయయ్యా, నొకమాట యాడవలసె ? మీ రాచార్యులరయ్యా, నితరునివలెఁ గానిగతులం గఱపి, నన్నిబ్భంగి భ్రమియింప నేల ? మీకు మాఱు వలుక నాసరోజభవునికైనఁ దరంబుకాదన నేనెంత ? నే జేసిన ప్రతినమాని సత్యముం దొఱఁగి స్వామికార్యంబునకు భంగం బొనరింతునె ? సుతునొల్ల, సతినొల్ల, రాజ్యమొల్ల, మీ పడఁతులనొల్ల, వేయేల నాకు సత్యం బొక్కటి

యచాలు'' నని నేత్రద్వయమునందు కరాళజ్వాలలు నటి యింప దుర్నిరీక్ష్య తేజోమూర్తియై ''ఖడ్గంబు విడుఁడు. మీరి చ్చోఁ నుండఁ దగ'' దనుడు, మునియు జేని నిలుకడయైన సత్యవర్తనంబునకు వెఱగంది జేని బొంకించు నాసం బోవీడి యవమానశల్యమును సహింపఁజాలక నిజ తపోవనంబున కఱిగె. అప్పుడు ఖేచరు లంబరవీథిని నిజాంగనాసమేతులై ప్రమోదంబున విమానంబు లెక్కి క్రిక్కిఱిసి వెఱగంది వీక్షించుచుండనాఁడు నెఱ తెంపుతో భిదురంబుకంటెబెడదం బై చదల నదరులు సెదర భయంకరలీలఁ దనకరవాలంబున నప్పువ్వుబోఁడి మెడఁ దెగ వ్రేయుటయు నవ్వేటు పూదండ గతి నుండఁ దల యూచి, సతిఁజూచి, దారితప్పనని ''నా యసి యసిపోవుటఁ జూడ కౌశికుని జాలమై యుండనోపు. కాదేని మద్భుజాశక్తి తూలియుండనోపు'' ననుచు నింకొక్క పెట్టి వ్రేయునవసరమున భక్తరక్షాదక్షుం డగు విశ్వ నాథుఁడు హరిశ్చంద్ర క్షితీశునకు సాక్షాత్కరింప, నవ్వసుం ధరాధ్యక్షుండు ''అహో! దైవసంఘటన మెంత యద్భు తము? సుఖమును గష్టముగను, గష్టమును సుఖముగను నెంతలో మార్చుచున్నది? అఘటనఘటనాసామర్థ్యము గల సర్వేశ్వరుని యనంతలీల లెంత చిత్రముగనున్నవి?'' యనుకొనుచు నీశుని పదంబులు నిజవదనంబు సోఁక నశ్రులు కన్నులం దొఱఁగఁ జాఁగిలి మ్రొక్కి లేచి నిలిచి నిటలతటఘటితాంజలిపుటుఁడై పెక్కు భంగుల నత్యంత భక్తియుక్తుఁడై వినుతించె, అంతఁ బార్వతీనాథుం డా జననాథుం గని ''రాజేంద్రా! ఈరేడు జగంబుల నినుఁ

బోఁటి సత్యసంధు నెందునుం గాన. నీధైర్యసాహసంబులకు మూఁడుమెచ్చులు మెచ్చితి. నీకు వలసినవరంబు వేఁడు మిచ్చెద'' ననుచు తేనిఁ గదియం దిగిచి తనకరంబున మేను నిమురుటయుఁ గరంబు లజ్జించి, మొగంబు వ్రేల్వైచి ప్రతివచనం బీక మిన్నకుండె. నీలకంఠుండు వానిభావం బెఱింగి నగుచు, "భూతగణంబులు గొలువ నీకాటిలోనుండ నీకేటికి? ఇది గాధేయు మహేంద్రజాలము. తన ప్రతిన నెఱపుటకై నిన్నిట్టిదశం గుందఁజేసె. ఇది యజ్ఞవాటిక గాని ప్రేతభూమి కాదు. ఈ శల్యంబులు సమిత్సమితి. ఈ కపాలము లుపకరణపాత్రములు. ఈరక్తపూరం బాజ్యంబు. ఈకొట్టులు యూపములు. ఈశిరోకేశములు దర్భలు. నీ యేలికయగు వీరబాహుఁడు కాలుఁడుగాని మాలఁడుగాఁడు. నీదేవిం దాసిగా నేలువాఁడు మాయానేస్తపుఁ గలిరాజు గాని భూసురుఁడు గాఁ''డని సందేహము దీర నుడివి తనదివ్య దృష్టినిచ్చె. అంత నయ్యిలాపతియు సర్వముం గని వెఱఁ గంది యానందముంబొంది భార్యాసహితుండై సాష్టాంగము లొనరించి, "పరమేశా! నీప్రసాదంబునంజేసి కాదె నా కజ్ఞానాంధకారము తొలంగి సుజ్ఞానోదయం బయ్యె! దేవ రా! దేవర దయారసశీతల కటాక్షావలోకనంబులకంటె నిఁక నాకుఁ గావలసినదేమున్నది? ఇఁక నాభవబంధంబులం బాపి నను నీభక్తునింగా నేలవే? నీదగు పదపంకజ పంజరాం తంబున నాదగు మానసరాజహంసంబును నిల్పుటయ దక్క నొండువరంబుల నేనొల్ల'' ననియె. అంతఁ బార్వతియు నతి మధురంబులగు నాతని వినయ సంభాషణంబులకలరి, యువ

కుంఠనవతియై యద్భుతానందరస సముద్రిక్త హృదయము తోఁ జిత్రింపఁబడిన చంద్రశిలా ప్రతిమవలె నిలువఁబడి యుండిన చంద్రమతింజూచి "ఇఁకనీప్రియుంగూడి యంచిత రాజ్యసామ్రాజ్య వైభవంబుల మించి, భూమిపాలించి, నీదు ప్రియభర్తం గూడి యేతెంచి మాయొద్దనెయుండుము. నీవు కోరినవరము లిచ్చెదఁ గో" మ్మనుటయుఁ జంద్రమతి యానందవికసిత విశాలనయనయై యాయమకుం బ్రణమిల్లి, యాభూవల్లభునందను సజీవుం జేసి తననిందఁ దొలంగంజేయు మనియె. పార్వతియు నమందానందంబున నమ్మహీపాలు బాలునితోడ లోహితాస్యుని సజీవుంజేసె. ఇట్లు జీవితుండై నిద్రమేల్కనిన చందంబున నల్లన లేచి తల్లికడకు వచ్చు లోహితాస్యుం జూచి చంద్రమతి కన్నుల నానందాశ్రు లుప్పొంగ నక్కునం గదియ నొత్తి ముద్దాడుచుండె.

ఆవేళఁ గౌశికుఁడు పరిభవ క్రోధానలోద్దీప్తుండయ్యుఁ దాఁగోరిన యర్థంబు సిద్ధింప కుండుటకుఁ బెద్దయుం బ్రొద్దు చింతించి తద్దయు లజ్జించి శిరమువాంచి, తనకుఁగల యాగ్ర హంబెల్లఁ బోనడంచి, చిన్నఁబోయి, "అక్కటా! దురహం కృతి నేఁ జేసిన ప్రతినకతన నాతపోధనంబెల్ల కడుండఱిగె నుగదా! ఇంద్రుఁడేల పరిశ్నించె? అంత నేనూరకుండక గర్వించి వనజభవునైనఁ దిరస్కరించి ప్రతిసృష్టిం జేసి దివి కిని భువికిని నొక్కసూత్రము గట్టఁజాలిన నామతిం బోఁ గొట్టుకొని మొఱకు పట్టుపట్టి వసిష్ఠునిఁ జెనకి వట్టికలహంబేల పెట్టుకొంటి? వాతప్పి గంజి పెడమూటయయ్యె? నానగు బాటునేఁత కేమిసేయుదు? తేనెలోఁ జిక్కిన యీగెయుం

బలె, నురిఁ దవిలిన పులుఁగుంపోలె నిపు డల్లాడుచున్నాఁ డను. సభాస్థానంబున నాబుద్ధి పెడతలఁబట్టె. కోఁపవిచేఁ దలగోకికొంటి. ఇంతయు గతజల సేతుబంధన" మని పశ్చాత్తప్తుఁడై యమ్మహీపతిం గదిసి కౌఁగిటంజేర్చి, "నరేంద్రా! సత్యంబునకు నాలవాలంబన్న నీవె. నీసత్యంబు పెంపు నాఁపసిచూడ నిట్లు నలఁకునఁ బొందించి నాతిని నిన్నును వేవేలవిధముల వెతలఁ గుడిపించితినిగాని, వేఱొండుగాదు. నాయపరాధంబుల క్షమించుము. నేనీపనికిఁ బూనునప్పుడ నీచే ననృతంబు పలికింపలేకున్న సప్తద్వీపవతియగునివ్వసుమతి యంతయు నేకాతపత్రంబుగా నీచే నేలింతునని ప్రతిన వట్టితి. ఇప్పు డందులకుం దగిన మహిమయు నీయందు నెలకొల్పెద. తావకంబగు సామ్రాజ్యలక్ష్మినింగొని రాజ్యంబును బూజ్యంబుగా నేలు" మని మిక్కిలి యక్కఱగల వాక్యంబుల నైక్యంబులు నెఱప "మునిచంద్రా! ఇట్లాడ మీకుఁ బాడికాదు. లోకప్రఖ్యాతిగాంచిన మీకును నపరాధంబులు గలవె? మీకతనఁగాదె నాకీర్తి మించె! మీ యనుగ్రహంబునఁ గాదె యీమహేశుం డీపద్మజాది దివిజులు గొలువ ననుంబ్రోవఁ జనుదెంచె! ఈ రాజ్యంబును మగుడఁ గొననొల్ల. మీకిష్టుం డగువానిచే నియ్యిల నేలించి పాలింపు" మనియె. అప్పు డామునీంద్రుఁడు నరేంద్రుం గని "అట్లచేసెద, నాకిష్టుఁ డగువాఁడు నీవదక్క యొరుఁడు లేఁడు. ఇందుల కొడంబడవేని బొంకితి నని పొమ్ము. పోవకున్న నాజాడకు రమ్ము. మును నాచేసిన ప్రతిన తప్పదు. ప్రతిజ్ఞాభంగముకంటె దురితంబులేదు. నిన్నెంతకాల

మేలింతునంటి నంతకాలమేలి యటమీఁద దేవేంద్రు సుధర్మా సనంబునం దెంతకాలంబు నిలుపుదు నంటి నంతకాలము నాకంబున నుండు"మని వాకుచ్చె. భూనాథుం డందుల కేమాడిన నేమిదోసము పొసఁగునో యని మాఱువలుక నోడి యెంతయుఁ జింతించుచుండె.

ఇంతలో నరుంధతీపతి యతిమోదితుఁడై శిష్యగణంబు కొలువ నేతెంచి భూపతిముోల నిలిచిన జననాథుఁ డమ్మునినాథునకు మ్రొక్కి "మునివరేణ్యా! మీదర్శన లాభమున నేఁ జరితార్థుండనైతి. మీకతన నేఁబుణ్యుండనైతి. ననుంబ్రోవ నిందుల కేతెంచితిరి గాన మీతలంపానతిం"డనిన వసిష్ఠుండు దన్నుఁబెద్దఁజేసి తనపూన్కి చెల్లించినందులకై సంతసించి కౌశికుం డేకరణిని మెలఁగుమనియెనో యాకరణి మెలఁగుటయ తన తలఁ పని వాక్రుచ్చె. పృథ్వీశుండును దనగురు నానతిఁ ద్రోయ నేరక గాధేయునానతిఁగావింప ననుమతించె. అంతఁ జంద్రశేఖరుండును, కమలాసనాదిగీర్వాణులును నమర నదీజలంబులం దెప్పించి త్రిశంకుపట్టికి మంగళస్నానంబు గావించి దివ్యాంబరభూషణాదికము-చ నలంకృలుం జను ధంణ తలంబెల్ల నేలునట్లు బట్టంబుకట్టి దీవించి, తన పట్టణంబున కేఁగ నియమించి నిజ నివాసంబులకుం జనిరి.

ఇంతలో నిట విశ్వామిత్రుండును దాను మున్నయో ధ్యాధిపత్యంబునకు నియమించినతన ప్రియశిష్యుఁడు సుయజ్ఞభూ దేవునికి, "స్వస్త్యస్తు. యజన యాజనాది షట్కర్మ నిరతుఁ డగు విశ్వామిత్రమానివరుండు, మా ప్రియశిష్యుండగు సుయజ్ఞన కాశీర్వచనములు. హరిశ్చంద్ర రాజన్యున కయోధ్యను

సర్వరాజ్యయుక్తముగ నిచ్చితిమి. కావున గజరథతురగసైన్య నిచయ పరిచారకులును రత్నభూషణధనధాన్య రాసులతోడ మగుడ నర్పించి బొక్కసమునంగల రొక్కమునకు జమా కర్చులెక్క జెప్పిరమ్ము" అని కమ్మ వ్రాసి చేవ్రాలుచేసి హరిశ్చంద్ర జనేంద్రుని సముఖమునం బెట్టి, "దీనింగొని సుయజ్ఞుని వలన సామ్రాజ్యమ్ము గైకొమ్ము." అని యాశీర్వచన పురస్సరంబుగా ననిచిపుచ్చెను. ఆతం డాకమ్మం గైకొని కౌశికు వీడ్కొని పుత్రకళత్రసహితుండై కాశికానగరంబు నిర్గమించెను. అప్పు డంతవృత్తాంతంబుఁ జారులవలనఁ గాశీశుం డెఱింగి చతురంగబలంబులతో నాచక్రవర్తికడ్డంబువచ్చి, "సార్వభౌమా! మీరు సామాన్యులట్లు పాదచారులును విగతపరివారులునై చనంజూచు టనువుకాదు. ఈపూట నావీటనిలిచి నాయింటఁ గలకొలంది విందారగించి నన్ను ధన్యుంజేసి యెల్లి తెల్లవాఱి సైన్యసహితంబుగ బయలుదేఱి మహావైభవంబుతో వేంచేయ నవధరింపుఁ"డని ప్రార్థించుటయు నాతని ప్రార్థన నాదరించి నాఁ డెల్లఁ గాశియందు వసియించి యాతని మక్కువందీర్చి మఱునాఁడు వఱువాత లేచి చంద్రమతీ లోహితాస్యులఁతోడఁ గనకరత్న రమ్యమహారథాధి రూఢుండై వెడలియెడ నెడఁ గానికలంగొనియెదుర్కొను మేదినీనాయకుల సాదరావలోకనంబులం దిలకించి మన్నించుచు నిరంతర ప్రయాణంబులఁ గతిపయవాసరంబులకుఁ గోసలదేశంబుఁ బ్రాపించెను. అట నారదుండు సుయజ్ఞసత్యకీర్తుల కావార్త వింతగాఁ జెప్పఁ సత్యకీర్తియు నత్యంతసంతోషభరితస్వాంతుఁడై "సత్యకీర్తులకుఁ బుట్టినిల్లగు మార్తాండకుల మండనుండు

మనల మేలువాటిల్ల నేలుకొనువాఁడై మరల వేంచేసెడు నఁట. ఎల్లవారు నుల్లంబులు పల్లవింప నాభూవల్లభున కెదు ర్కోలు గావింపుఁడు. పురంబెల్ల శృంగారింపుఁడు. గృహద్వా రంబులం దోరణంబులు గట్టింపుఁడు. గేహాళుల ముత్యాల ముగ్గులు వెట్టింపుఁడు. రాజమార్గంబునమృగమదలలితంబులగు కలయంపులు చల్లింపుఁడు. బహిర్ద్వారంబున రంభాస్తంభంబు లతోడఁ గలువడంబులు వన్నింపుఁ" డని సుయజ్ఞునాజ్ఞం బురంబునం జాటంబంచెను. వారును బురం బలంకరింపంజేసి స్వాతివానకై శుక్తులరయుచందమునఁ దదాగమనం బాకాం క్షించి యుండిరి. తోడన సుయజ్ఞుండును సత్యకీర్తిప్రముఖు లగు నమాత్యుల నున్నిడుకొని పౌరులుబలిసి యెతేర, వివిధ వాద్యములతోను వందిమాగధజయధ్వనులతోను హరిశ్చంద్రు నెదుర్కొని, తనుంగన్నంతనె యరదంబుడిగ్గి మ్రొగ్గి నతులొనర్చు సుతసతీనాథుండగు నరనాథుం గరంబు గార వించి, యంచితోక్తుల దీవించి, యాతని నిత్యమహిమ సన్ను తించి, సన్నుతంబైన రాజ్యలక్ష్మిం బన్నుగాఁ గైకొనుమని విన్నవించెను. అందులకు హరిశ్చంద్రుండు మహానందంబు నొంది చతురంగబలసేవ్యుండై వందిబృందములు కైవార ములు సేయఁబుణ్యాంగనలు సేసలు చల్ల, భూసురసువాసిను లు గప్పురపునివాళు లిచ్చిరి. ఆదినము నగరమంతయు నతి సమ్మర్దముగనుండెను. రాజభవనము మొదలుకొని రాజ మార్గమంతయు నేనుఁగులతోడ నశ్వంబులతోడను సకలా యుధ సన్నద్ధమగు సైనికజన నికాయముతోడను నిండియుం డెను. భేరీధ్వనులు దిగంతరముల బధిరీకృతములుగఁజేసెను.

గజబృంహితంబులును, హయహేషారవములును, వంది మాగధసంకీర్తనంబులును మిన్నుముట్టెను. భూసురులాశీర్వాదంబులతో మంగళాక్షతలం జల్లుచుండిరి. గగనసదృశంబులగు సౌధోపరితలంబులం బౌరసుందరులు గొందఱు బాగులుదీరి, వ్యోమయానంబులనుండి తిలకించు వేల్పుటంచయానలం బురడించుచు, నొండొరులం జేరి కుమారసమాన విగ్రహుండై నభోమణికులజుండగు త్రిశంకుకుమారు ననిమేషులై చూచుచు,

"ఓకలభాషిణీ! ఈఁగఁగారాని లేనియప్పు పైఁబూని, చలపట్టి గాసివెట్టిన గాధిపట్టి మాయలం జిక్కువడక ఋణములదీర్చి ముజ్జగంబుల నిట్టిసత్యవ్రతునికి సాటిలేరను మెప్పు గాంచిన త్రిశంకుపట్టిం జూచితివే? సత్యవాక్యంబెకదా సర్వసాధనంబు. ఆహా! ఆచక్కఁదనముంజూచిన నారమేశాలకాధిపసూనులకైనఁ దలవంపులు కాకమానునే? ఆతని శౌర్య మాషణ్ముఖవిక్రమాటోపముకన్న మేటికాదే? ఆతని వైభవంబు దేవేంద్ర దనాధిప విశ్రుతకీర్తులకు వెగటు గాకమానునే? ఇట్టిసన్నుతచారిత్రు,నిట్టిసత్యవ్రతు, నిట్టిరాజసార్వభౌముని సాటి ముజ్జగంబులనైనం గానవచ్చునే? కౌశికుఁడు ద్రోహియై చలపట్టి యాతని వెతలఁబెట్టి తానుచిరకాలంబు శీతవాతాతపంబులకోర్చి పేర్చిన కడంకం గడంచిన ఫలంబు నిరర్థకంబుగా నీసువెంచి వీరల నెంచరాని యిడుమలం గుందించి, తుదకుఁ దాఁగన్నది యిందు నందును నిందయ గాక యొండేదియుఁ గానరాదు."

మఱియొకర్తు, "అమ్మా! అదేమియెక్కువే? ఆప్రక్కఁ బసిడితే రెక్కవచ్చు చక్కెరబొమ్మంజూడరే? పతులె దేవతులగు సతులకు నిదియతగవని తెలిపెడునోయనఁ గౌశిక ప్రకల్పిత మాయోపరాశిం దాఁటించుపొంటె నంటరాని వేలుపుంజొచ్చె. ఒచ్చెంబనక వరవడై యమ్ముద్దుఁబోవం బాలువడియె. ఇట్టికులపాలిక లెందుఁగలరు? పతివ్రతారత్నం బుల కెంద్రైన న్యాయధర్మములు బాయునా?"

మఱియొకర్తు, "ఈచిన్నారి దా నోచిన నోములపంట యుంబోలె మున్నిడుకొన్న పిన్నాతనిం జూడరే? వీని చెక్కిలి మీఁటినఁ బాలుదొలంకవే? ఈచక్కనయ్య యొక్కమ్రుక్కిడి పాము గఱువం జచ్చి బ్రదికెనఁటగదే? అమ్మటుమాయ మానినయిడు నాపద లను వనరాసులీఁది సత్యంబనునోడం జేకొని యాదరింజేరిన నిత్యసత్యవర్ధిష్ణుల నిట్టివైభవంబునం బ్రాపింపఁ గన్నారఁ గాంచిన మనభాగ్యం బేమనవచ్చునే? ఆభాగ్యంబు నేఁడుగా మనకబ్బె" నని ముచ్చటింపఁ జొచ్చి తెలిముత్తెంపుసేసజల్లిరి.

అంత నాభూవరుండు భూసురసువాసినులగు రాజ వదన లిచ్చు మగరాలపళ్లెరంబుల గప్పురంపు నీరాజనంబు లంగీకరించుచు రాజవీధుల రాజసంబున నేతెంచి రాజసదనపు మొగసాల నొయ్యన భద్రకరిడిగ్గి, హెగ్గడులు సాహో నినాదంబులు బోరుకొలప శుభముహూర్తంబున నాస్థాన మంటపంబు సొత్తెంచె. అంతకుమున్న యచ్చటికివచ్చియున్న సుయజ్ఞుం డాతని సముచితాసీనుంజేసి భద్రాసనంబునం దా

నాసీనుండై మంత్రి సామంతపౌరవర్గంబులంగూడి పరివేష్టించియుండ,

"దేవరా! నాఁడు వేఁటాటకుంబోవుచో నున్న రూపున నేఁడుగదా మిముం గనుఁగొనంగంటి. మిమ్మువంటి యేలికం బెడఁబాసి యొంటి నుండంగన్న దైన్యంబు నీఁగఁగంటి" నని, బాష్పములుగుప్పనఁగన్గొలంకుల గ్రుక్కుచుఁ దనయార్తి బూర్తిగ నెఱుకపడ నొత్తి విన్నవించు సత్యకీర్తి నాదరించి, తనయెదురం గూర్చుండ నియోగించి, సుయజ్ఞుంగాంచి, యాతనికి వేనతులొనర్చి, యాతనివలనం దీవెనలంగాంచి, "ద్విజసత్తమా! మీగురుని కటాక్షంబున గురుతర కీర్తిం గాంచితి. ఆతని మహిమం బొగడఁదరమే? ఏటికిఁక పరివేదన? పూర్వకర్మంబులు వెనుతవులంగ నెట్టివారికి ననుభవింపక తీరదుగదా? మానవు లెన్నడును ఖేదమోదంబుల మత్తిలుటే యవివేకము. కావున మీగురుం డీఁగరాని ఋణంబుం దీర్ప నన్నిట్లు కలంచుట బాలునిఁ జెక్కిలిగొట్టి పాలుత్రావించిన చందంబనియే తలంచుదునుగాని నాకుఁగీడని తోఁచదు." అని యమాత్యుని మనస్తాపంబుఁ దనవివేక వచనామృతమున నుడుప, సుయజ్ఞుండును,

"నృపాగ్రణీ! నాగురుండు బుద్ధిమందుడై తన తపోమహత్త్వము వృథాయగునంతకు లేని యాసు లోనఁ బెంచి మిమ్ముల నింతగాఁ నవిధిబెట్టెను. మీకుఁబెట్టిన కడగండ్లం జూచి సుజనులెల్లఱును వంతంగూరకుందురా? సర్వభూతదయాపరుండగు పరమాత్మ యించుకేనిదీనినంతయునూహింపకుండునా? మీ కిందులకుఁ బ్రతికారంబొనర్పకుండునా?

మానుసయితము మనసులు రోసె. ఎచ్చోఁగాని మానులకు మచ్చరంబులు గారాదు. సందరసి మీసత్యము నిందింపఁ దలఁచి తానే నిందఁబొందె. మీ మహిమయెవృద్ధిఁ బొందె'' నని బహుభంగులఁ బ్రస్తుతించెను.

అంత హరిశ్చంద్రుండును దనకుఁ గౌశికుండు వ్రాసి యిచ్చిన కమ్మను సుయజ్ఞునెదుటఁ బెట్టించెను. ప్రాజ్ఞుండగు నాసుయజ్ఞుండును నద్దాని నతిభక్తి నెత్తి కన్నుల నొత్తికొని చిత్తంబున మెత్తపాటొత్తిరింపం జదువుకొని,

''రాజేంద్రా! మీసీమలలో గుత్తలవల్ల నయిన యాదాయ మిది. సకలదేశములందును గన్న ధనమిది. పరమహీపతు లంపిన రొక్కంబిది. ఊడిగంబులకును నగరిమనోవర్తులకును ముద్రకర్తలజీతములకు నైన జీతమిది. కౌశికుండు నన్ను నియమించు టొక్కటియేకాని మునివ్రయం బేమియును లేదు. దినభోజనంబునకును హవిస్సునకును నేఁగట్టిన రెండు ధోవతులకును దప్పమీధనంబున నర్ధవీసంబైన వెచ్చింపలేదు. మఱియు భవదీయ గ్రహచారదోషములు నివారింప నవగ్రహజపంబులకును, హోమంబులకును, ధరామరుల భోజనంబులకును జెల్లినద్రవ్యంబు పోను గొదవ నిలిచిన వివి'' యని లెక్కలును ధనధాన్యరాసుల నొప్పగించి, ''మేదినీపతీ! నేవైదికుండనగుదు భూపాలనంబునకుం దగనివాఁడ నగుదు. ఈదినమువఱకుఁ దెలిసియో తెలియకయో చాలహెచ్చరికతోఁ బాలించితి. ఎట్టులున్నం గైకొనవలయు'' నని ధరణీశునివలన సెలవుబడయఁగోరి ''ధరణీశ్వరా! ఇఁక సెలవా? నాగురునికడ

కరిగెద" నన హరిశ్చంద్రుండు సవినయుండై మ్రొక్కుచు, "ననఘా! నన్ను ధన్యుంజేయఁ దలంతురేని కొన్నాళ్లైనను మిమ్మిందుండ వేఁడెద" ననగా సుయజ్ఞుండును వల్లెయని నిలిచెను. అదివఱకు సుయజ్ఞునాజ్ఞకు లోఁగి భీతులై యొదిగియుండి తల్లి లేనిబిడ్డలవడువున నుండిన నాగరులిపుడు మది నఱవిడిచి, రాజునకు మాటికి వందనములు ఘటియించి "దేవరా! రవిదర్శనమునకై తామరసములభంగియు, దవ్వులకుంజనిన వరునికై సతీమణి వైఖరియు, జాబిల్లికై హల్లకము రీతియు దిక్కుడలితారుచు, శుక్తులుస్వాతివానకై నిరీక్షించునట్లును భవదాగమనం బతికాంక్షం గోరుచుంటిమి. నేఁటికాలమునకు మీపాదములు గంటిమి. ధన్యులమైమంటి" మని విన్నవించుకొనిరి.

హరిశ్చంద్రుండు నందులకు నవ్వుచు "సుయజ్ఞుని యాజ్ఞచే భూసురార్థంబై మీర లనిశము ప్రయాసవహించినదెల్ల వ్యర్థంబుగానేరదు. మీకు సుకృతంబులెల్లఁ దోడుతనె దొఱకెఁబొండు. ఇఁక సుఖంబుండుఁ" డని పౌరులనాదరించి, జాంబూనదాంబర తాంబూలము లొసంగియంపెను. ఇట్లు హరిశ్చంద్రుండు భద్రసింహాసనంబధిష్ఠించి సర్వసాగరావృత క్షితినాథులు కానికలిచ్చి కొలుచుచుండ సార్వభౌముఁడై రాజ్యంబుఁ బూజ్యంబుగ నేలుచుండెను.

అట్టియెడ నొక్కనాఁడు వసిష్ఠుం డారాజశ్రేష్ఠుం గానరా నన్నరనాయకుం డతని దవ్వులంగని గద్దియడిగ్గి తద్దయుఁ బ్రీతినదు రేఁగి యర్ఘ్యలిచ్చి వందనమొనర్చి కుందనపుఁ బీఠి

కప్పై నాసీనుం జేసి, మెడఁగలుగ నిలిచి యడఁకువ గడలు కొనఁ గేల్మోగిచి సేమంబారసి యిష్టాగోష్ఠి నుండె. ఇంతలో జంద్రమతియుఁ జనుదెంచి గురువరునడుగుల కెరఁగి, యొడయునికడ కరిగి యొదిగి నిలువంబడియుండె. అంత నరుంధతీపతి చంద్రమతిని సుయజ్ఞునకుఁ జూపి "తాపసోత్తమా! ఈ సతీ విపులపతివ్రతా మహిమ కేయజ్ఞకర్మధర్మములునుబోలవు. ఈనరేంద్రు నొందిన మహాదాపదలన్నియు దీనియుత్తమశీలంబ సుమీ నడపఁగల్గె" ననుడు, సుయజ్ఞుండును, "మునీంద్రా! వీరిమహిమ యంతయుఁ దావకకటాక్షమహిమకుం దావలమై యుండుఁ గాదె? అది యటుండనిండు. ఈహరిశ్చంద్ర చంద్రమతుల పూర్వజన్మవృత్తాంతం బెట్టిది? వీరిట్టి యిడుమలం గుడువఁ గతంబెద్ది? ఈబిడం గాలకౌశికుండు దాసిగాఁగొన నేల? తక్షకుండు దక్షకుండై లోహితాస్యుంగఱచి చంపు టెట్లు? దండధరుండు చండాలుండై యుండ నేల? శనైశ్చరుండు కాలకౌశికుండు గానేల? యని నామనంబు శంకాసంకలితంబై యున్నయది. నాసందియంబుల మాన్పి మన్నింపవే" యన, వసిష్ఠుం డాతని ప్రజ్ఞావిశేషంబునకు మెచ్చుకొని యిచ్చపొదల నిట్లనియె.

## చంద్రమతీ హరిశ్చంద్రులపూర్వజన్మవృత్తాంతము

"పుడమికిఁ దొడవై యవంతి యనా నొక్కపురవరంబుగలదు. అందు నీలలోహితుం డను రాజన్యుం డేలుచుండె. ఆపురిని జవభద్రుం డను హాలికుండు గలఁడు. ఆతనికిఁ గల కంధర యను కోడ లొకర్తుగలదు. వాణిమగఁడు తా బుద్ధి

చెడి దానిమగని నెడ్డయై కాటెనుఁబోతువంటివానిఁగా నిర్మించె. వాఁడేరు దున్నిచేలు దీర్చి, బీళ్లు, చెట్టులు గొడ్డంటఁ గొట్టి, మురుసు|గనిమల నతికి బలిసినచేలలోఁ గలుపులుదీసి, ప్రొద్దు గూకఁగ నిలు సేరి కడుపునిండ సంకటిమెక్కి గుఱుకలిడి నిదురించుచుండు. అయ్యింతి యత్యంతరూపలావణ్య యగుటం జేసి తనజవ్వనం బడవిఁగాయు వెన్నెల యయ్యె నని కడుం గుందుచు, వాని నెన్నండైన మగండని యెంచక, తనయీడు కాఁపుపడుచులతోడ నేకులు వడుకుకొనుచుఁబ్రొద్దులు కడుపుచుండె.

అట్టియెడ నొక్కనాఁడా ప్రోలియేలిక నీలలోహితుండు స్వారివెడలఁ దలఁచి, ఘోటకారోహణుండై మహేంద్ర వైభవంబున రాజమార్గంబునఁ గదలి చనుచుండె. అవ్వేడుకం జూడఁ బురాంగనలు తమతమ గృహద్వారంబులకడ బారులు దీరి నిలిచియుండిరి. అప్పు డప్పడఁతి తోడియింతులతోడఁ దలవాకిటికి వచ్చి, భూకాంతుని మనసుదీరఁ దిలకించి, యించుక నిదానించి, వాని నించువిలుకాని మించిన సొబగువానిగఁ దలంచి, తల పంకించి వానినెదం గదురఁ జేసి లోనికిం జని యొరులు బిలిచినను బలుకక యొకపనిం బూని వేఱొకపని ఘటించుచుఁ దబ్బిబ్బుమాట లాడుచు నాహారనిద్రలఁ గోరిక లుడిగి తన భ్రాంతిని వీడలేక వ్రీడలేక యుండెను. అయ్యిలాపతియు దాని పొలుపు గన్నులారఁ గాంచి తనస్వారి చాలించి, పరివారముం బోవంబంచి, నగరికేతెంచి, ఆరని తమకంబున మంచముపై శయనించి, కలకంధరపై మనసుంచి, కడుం జింతించి, చతురమతియగు

నొక్క కుంటెనకత్తియ రావించి, తనచూచిన జవరాలిపైని విరాలి సూచించి తన్నుద్ధరించి ప్రోచునట్లుఁ బ్రార్థింప, "నిదెంతపని! దీనికింత చింతయేల?" యని యారాచదూతి కయు వానిమనసులోని యుడుకు చల్లార్చి, యనుదినమును నొక్క నెపంబుఁ బూని, దానింటికి రాకపోకలుసేసి, క్రొత్త క్రొత్త పాటలు పద్దెంబులు పాడి చదివి తొల్లింటి యాఁడుఁ బాపల సుద్దులు చెప్పి, యయ్యింతిం జెలిమిఁ జేసి, పెండ్లి పాటలు మంగళారతులు మొదలగు పాటలు నేర్పి మెప్పువడసి హాస్యపుకథ లుగ్గడించి బిగ్గఱ నవ్వించి, ముగ్గులుపెట్టఁ బను పఱచి, యరమరలేని చనవు సంపాదించి, యొక్కనాఁడేకాం తంబున ముచ్చటలుగులుకు కథలుచెప్పి నవ్వించుచు, సంద రసి దాని కాఁతేని ప్రేమం దెలిపె. కలకంధరియ దాని నే స్తం బెంతయుఁ బ్రశస్తంబుగఁ బాటించి కలక దీరి పరమా నందమునఁ దనమందిరము సంకేతస్థలముగ ధరావరుం గూడి మెచ్చువడసియుండె. జవభద్రుం డాజాడ జాడగాఁ దెలిసి దానిం జంపఁ దెంపుసేసియుండె. ఆముద్దియ నాసుద్దిం జూ చాయగా నెఱిఁగి యవనీధవున కెఱిఁగింప నాతండు కోపోగ్ర రోషకలితాత్ముండై, దుర్మదంబున ధర్మంబుతెరువుఁ గానక, యాపంటదొరనుఁ జెఱనిడి, వారివారినెల్ల మాలలకమ్మించి, వారి సర్వస్వముం గొల్లకొని యయ్యింతిం దన యిల్లు సేర్చుకొని స్వేచ్ఛావిహారంబులఁ గాలయాపనము సేయు చుండె.

అంతఁ నొక్కనాఁ డాపురిలోనం గేదార గౌరీవ్రతంబు జనులాచరింప నది గని కలకంధర రాజపురోహితునిఁ దన

యిరవునకురావించి తద్వ్రతాచరణ విధానంబును, దాని వలన నగు ఫలంబును దెల్పుఁడని వేఁడ, వారు నా వ్రతా చరణవిధానంబును, దానిం దొల్లి పార్వతి యాచరించి పర మేశ్వరు నర్ధాంగంబుం బడసిన క్రమమును సవిస్తరముగ నెఱింగించినఁ దానుం బరమభక్తి పురస్సరంబుగా నవ్వ్రతం బేక వింశతిహాయనంబు లాచరించి, సహస్ర బ్రాహ్మణ సంత ర్పణంబును, షోడశమహాదాన కరణంబును సలిపె. దానం జేసి యాకలకంధరా నీలలోహితులే యపరభవంబునఁ జంద్ర మతీ హరిశ్చంద్రులై యుదయించిరి. చంద్రమతి ము న్నుత్తవారిల్లు రుత్తపాడు చేసినదోసంబున నీభవంబున దుష్ట లగ్నమున జనియించి ప్రథమరజస్వల యైన కతన జనకవంశ నాశనియయ్యె. కులశీలంబులం బాటింపక పరపురుషాసక్త యైన కతంబున నతిదైన్యసంపాదకంబగు దుష్టముహూర్తంబున సమర్తయై జననీజనక పరిత్యక్తయుఁ బతిరహితయు, నగ్నిప్ర విష్టయు, దాసీభూత విక్రీతయుఁ బుత్రశోకపాత్రయు నయ్యె. కేదారగౌరీవ్రతాచరణంబునం జేసి యెన్నిపుట్టువులందేని నీల లోహితుండె భర్తగాఁ గోరికొనియెం గావున త్రిశంకుపట్టి యై పుట్టిన యాపట్టభద్రునిం జెట్టవట్టె. దానిమామను వాని చుట్టంబులను మాలలకు దాసులుగ విక్రయించుటం బట్టి యిక్ష్వాకువంశంబునం బుట్టియు హరిశ్చంద్రుఁడు మాలనికి దాసుఁడుగ విక్రీతుఁ డయ్యె. ఎట్టివారికేని కృతం బనుభవిం పక తీరునే ?'' యని వసిష్ఠమునీంద్రుండు చంద్రమతీ హరి శ్చంద్రుల పూర్వజన్మ వృత్తాంతంబు సర్వంబు నానతిచ్చె.

---

### విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునికిఁ దనతపోఫలమున సగము పంచియిచ్చుటకుఁ గారణము.

పిదప గాధేయుఁడు చిర సమార్జిత తపఃఫలంబునఁదన పుణ్యంబున సగంబుఁ బంచియిచ్చి హరిశ్చంద్రుచే భూచక్రం బెల్ల నిర్వక్రంబుగ నేలించుటకుఁ గారణం బేమి యని సుయజ్ఞుం డడుగ నయ్యరుంధతీవిభుం డిట్లనియె. "తొల్లి సర్వజిత్తను రాక్షసుండు సర్వలోకవిజిగీషుఁడై యనిమిషగిరి కరిగి కఱకంఠుంగూర్చి చిరకాలంబు తపంబుసేసి కోరినవరం బులం బడసె. అంత నారాక్షసుండు రాక్షవర్తనుండై సహస్రాక్షాది దిక్పాలకుల నోటుపఱిచి దానం దనివి సనక తనబోఁటి క్రూరరాక్షసులు కోటానఁ గోట్లు తోడువడ నా నీచదోషాచరుల సాయంబున సహస్రాక్ష ప్రముఖ దిక్పాల కానీకంబు నాక్రమించి, కష్టంబరాక్రమించి విషమ సమరం బుల నయ్యనిమిషకోటి నోటుపఱచి, దానఁ దనవిసనక ముని గణాశ్రమంబులు సొచ్చి యాగయోగంబులం జెఱచి, నల్లయు నెఱచియుఁ జిత్తజల్లుగాఁ గురియించి సంయముల సవనంబులఁ జీకాకుపఱిచి చెఱిచి, నలుదెఱంగుల సాధుబాధలు సేయుచు విఱ్ఱవీఁగుచుండె. అట్టియెడ జడదారులెల్ల నొక్కయెడంగూడి సర్వజిత్తుం బరిమార్ప నెయ్యది యెత్తని విచారించి, అపరవిరించియగు విశ్వామిత్రుంజేరి "మముంగావ నీవదిక్కు. వానిమడియించు నుపాయంబుఁ జింతింపవే" యని ప్రార్థించిరి. అందులకుఁ గౌశికుండు, కడుందడవు విచారించి "నేను సర్వంబు నెఱుంగుదు. వాఁడు హరుని వర గర్వంబున మత్తుకొని యుత్తముల నొత్తరించుచుఁ బ్రబలి

యున్నవాఁడు. వానికి మిత్రుండును, నేఁపునఁ బాపకర్మం బులు గావింప శంకింపనివాఁడు నగు నీలలోహితునిచేఁ ద క్క నొరులచే నడియఁ" దని వారి వేఁడికొని లియ్యకొని దుష్టశిక్షకుం గడంగి యవంతికిం జని యన్నరనాథునికిఁ దన మతంబు దెలిపి, వాఁ డందులకు సమ్మతింపమి వానితో, "ధాత్రీశా! ఆశ్రితాభీష్ట ప్రదానంబె రాజులకుఁ గర్త వ్యంబు. రాజులు స్వజనపోషకులు నన్యజనదూషకులునై, సప్తవ్యసనంబులం దగులక, సప్తాంగంబులం గాచికొనుచు, శత్రువులయెడ సామ, దాన, భేద, దండ, మాయ, ఉపేక్ష, ఇంద్రజాలంబులను నుపాయంబు లేడింటిం బ్రయోగించి, కా మ, క్రోధ, లోభ, మద, మాత్సర్యంబు లనెడి యరిషడ్వ ర్గంబుల మనసుగాడఁగఁ బాఱనీక, యింద్రియస్తోమ విమార్గ వర్తనముం ద్రుంచి యెవ్వారిం జెనకి యేపక నొంపక, రా జ్యం బేలిన నమ్మహితాత్ములు సర్వ మహిమాతిశయంబును బొందుదురు. ఇవ్విధంబుగాక క్రొవ్వి కామక్రోధ కలిత చిత్త వృత్తిగలుగ నడచు పతికిఁ బ్రజసేయు పాపంబులం జతుర్థభా గంబగు! ప్రజాపరిపాలనంబునం దగిన తెఱంగున దుష్ట శిక్షణంబుఁ గావించుట యుత్తమ క్షత్రధర్మం బగు. నీవు పరదారపరాయణుం డను నపవాదంబు గడించుకొంటివి. దానిం దలంగుపొంటె నే నర్థించు కార్యంబు నిర్వహింపఁదల కొంటివేని నిర్వాణం బనతిదూరంబగు. నేనన్నో నీకు మిత్రుండ. ఆదరపాత్రుండ. మిత్రామిత్రవిచారంబు పా త్రవిషయంబునంగాని యపాత్రవిషయంబునం బాటింప రాదు. కావున నీవు దీనికొడంబాటు సముచితంబు. సా

ధు బాధాపనోదంబు సర్వశ్రేయంబులకు నిదానంబు. సవనంబుల యవనంబు సేయుట దక్క నొండుమతిగా” దని హితముఁ జెప్పి యాదైత్యునిఁ బొరిఁగొన నొడఁబఱిచె. ఇందుల కాతఁ డాచక్రవాళపర్యంతము పుడమినేల ననుగ్రహింపు మనుడు, మునియు “నీతనువునఁ బెక్కు దురితంబు లొనర్చితివి గావున రాఁగల జన్మంబున నేతత్సుకృతంబునం జేసి యాదిత్యాన్వయంబున సత్యవ్రతుండను నపరనామంబునం బ్రసిద్ధుండవై త్రిశంకునకు నాత్మజుండవై జనించి సత్యనిత్యుండవై హరిశ్చంద్రాహ్వయంబున నెగడంగలవు. అపుడు చిరసమార్జితంబగు నాతపఃఫలంబున నగంబొసంగి నినుం దేజస్వింజేసి యేడుదీవులు నీచే నేలించెద. సర్వధాత్రియు నట్ల యేలుదువుగాక” యని చెప్పి సర్వజిత్తుపై దండెత్తనుద్యుక్తుం గావించి, యందుల కుఱవగు దివ్యాస్త్రంబులు పెక్కులిచ్చి, ప్రయోగోపసంహారంబుల నుపదేశించి నిజ నివాసంబునకుం జనియె.

ఆదట నవంతీపతి రణంబొనరింపఁ గట్టాయితుండై చనిన వార్త సర్వజిత్తు విని కినిసి కాలిదాపున గెరలు మహోరగంబునుంబోలె బుసగొట్టుచుఁ జుట్టుకొన్న మంత్రుల నవలోకించి “వింటిరా నీలలోహితుని బంటుతనము” “కట్టా! జడదారులమాయదారి నుడువులకుఁ జెవియొగ్గి యెగ్గులగ్గు నెఱుంగక పాలవంటి నానేస్తముఁ బదటగలిపి యులిపికట్టై తనంబున నాపై దండెత్తెడునట! ఈనీలలోహితుఁడు నాకహితుఁ డగుట నెఱుఁగనైతి, కాదని యూరకుందమన్న నుండనెట్లువచ్చు? మనము నిప్పుడ దడంబులుగూర్చుకొని వాని నెదిర్చి పరిమార్ప

వలెంగాని మానరాదు. ఇఁకనన్నిచుంగాచుపూనిక మనకేల?" యని ప్రయాణభేరి వేయించి రణరంగమునకుఁ దర్లిచనియె. నీలలోహిత ప్స్నానాథుండు నక్షీణరాక్షస బలంబుతో వచ్చిన సర్వజిద్రక్షో నాథుండును సముద్రంబు సముద్రంబునుం దారసిల్లిన వీఁకం బ్రదరంబుల నేసియు గదలవేసియుఁ గుంతంబులం గ్రుచ్చియు బట్టిసంబులం దట్టియు శూలంబుల నొత్తియుఁ గరవాలంబుల మొత్తియు ననేకప్రకారంబులం దొమ్మిజగడంబులం జిమ్మిరేఁగి యహర్నిశంబులు వింశతిదినంబు లెడతెగక పూర్వంబు వర్ణింప నలవిగాని సుధానిమిత్తంబుఁ బ్రవర్తించిన దేవదానవ యుద్ధంబు ననుకరించి యుద్ధముం జేసి యుభయదళంబులు నిరవశేషంబుగాఁద్రెళ్లిన మానవదానవాధీశులు పొలివోని బంటుతనంబున నిల్చి దివ్యాస్త్రప్రయోగంబులు సేయుచున్న ద్వంద్వయుద్ధంబున నవంతీనాథుఁ డవక్ర యసురమాయాడంబర మడఁచిగాధేయదత్త దివ్యాస్త్రింబగు బ్రహ్మాస్త్ర ప్రయోగంబునసర్వజిత్తుం డెగటార్చె. ఆభావరుండే మఱుభవంబున హరిశ్చంద్రుండై జనియించుటం జేసి కౌశికుం డాత్మతపఃఫలంబున నర్ధంబుఁ బంచియిచ్చె.

## లోహితాస్యుని పూర్వజన్మ వృత్తాంతము.

పిదప సుయజ్ఞుండు, లోహితాస్యుం దక్షకాహి గఱచి గిట్టింపనేల యనియడుగ వసిష్ఠుండిట్లనియె. ఆదియుగాదియందు సురాసురులందఱు నొద్దికతో మందరాద్రిచే క్షీరోదధిం దఱచిరి. అందు సుధయు, రమయు, శశాంకుఁడును, పాదపపంచకంబును, వెల్లయేనుంగును, నఱువదివేవురు నచ్చరలు

నుద్భవించిరి. అయ్యచ్చరబోటులందఱును లోకైకమహాసుంద
రులై పెంపొంది వెలవెలఁదులయ్యుఁ బురందరుం గొలుచుచుం
డిరి. అందు రంభ తనకాంతిరూపయౌవనముల మాఱులేక
యతిమనోహరంబై దివియందు వర్తిల్లుచుండె. అంత నొక్క
నాఁడు జక్కులఱేఁ డింద్రునిసమ్ముఖమునకుం బోవుచు నిజనం
దనుని రమ్మన వాఁడంతకుమున్నె రంభ చక్కనిదని వినియుం
డెఁగానఁ బితానుతు లందలంబెక్కి యమరావతీ వీథుల
వచ్చుచుండ రంభయు ధనదుని నందనుండగు నలకూబ
రుంగాంచి యాతని మోమునందముం జూచి చంద్రుండు
కళంకుఁడనియు, రమానందనుం డనంగుఁ డనియు, వీని
ముందు వారల నెంచఁదగదని వానిపై నెక్కువ మక్కు
వం గొనియుండె. అయ్యక్షరాజ సుతుండు నయ్యచ్చరనీక్షించి
యచ్చెరువంది, వనితాసంతతి కెల్ల సిరులియ్యఁజాలి యాటఁ
బాటలఁ బెంపెక్కిన యాచక్కని మేల్బెళ్కుల కత్తియయ
రంభగావలయునని భావించి విరహార్తిం జింతింపుచుండె.

అంత నారంభయుఁ దనమదిని నాటియున్నవిరాలిం
జూపుచు నొకకమ్మ వ్రాసి తన చెలిచే నిచ్చి నలకూబరుని నయ
భాషలచేఁ గొనిరమ్మని పంచుటయు, నట రంభపైని మక్కు
వచేఁ జింతిలుచుండిన ధనదునిపుత్త్రుం డాకమ్మం జదివి పలు
మఱుఁ గన్నుల నొత్తికొని మోదము మనంబునఁ బిక్కటిల్ల,
రంభాపరిరంభంబునకు గల త్వరచేఁ దర్లి గృహద్వారంబు
దాఁటుచుండు నత్తఱిఁ దక్షకుండగు సర్పము నలకూబరున
కడ్డంబుగాఁ బఱచిచనియె. నలకూబరుండును "నంబివాఁడెదు
రైన నాగుబామెదురైన చెవులపో తెదురైన జేటుమూడు"

నని శాస్త్రముకావున నది యనర్థసూచకం బని తలపోసి నిజ కరాసిం దానినఱికి రంభాసదనంబునకుం జని సుఖంబుండె.

అటఁ దనయునివృత్తాంతంబు నారదునివలన నెఱింగి తక్షకుండు కరంబుశోకించి తత్క్షణంబ సురపురికేఁగి యాధన దుని సూనుంబిలిచి రోషారుణేక్షుండై "ఓనలకూబరా! నాసు తుం డేమిసేసె? నినుఁ గఱవవచ్చెనా? పొగరునం దిట్టెనా? మఱేమిసేసె? చిట్టిగాలియె యాహారముగ దినములు గడుపు నట్టి యనాథలు పేదలనిద్దైన నారయవైతివే? కలిమి గలం దులకుఁ గుడువంగను గట్టను దీరగునుగాక. ఇట్లు జేసినసన్ను నులోర్తురే? నినుందిట్టిరా? ఔర! వధియింప నీకెట్లు చేతు లాడె? ఏమియు నెఱుఁగని నాపాపనిఁ బాపంబనక పొలియిం చినందున భువిని మానవుండవై జనించి నేఁ గఱవం బిట్టు మిట్టి పడి మడిసెదుంగాక" యని శపియించి తనసుతుం బ్రతి కించి నిజలోకంబునకుం జనియె. యక్షకులేశనందనుం డా వృత్తాంతం బెఱింగితక్షకుని శాపవేదనకుఁదల్లడమంది దిక్కుఁ గానక యారాత్రిమెయినుండ, రంభ యద్దానిం గాంచి నిజనా థునితోఁ దన కనుంగు చెలియగు మేనకకు వలపుకాఁ డగు టంజేసి కౌశికునికడకు జని సాష్టాంగ దండప్రణామంబు సేసితక్షకుని శాపకారణంబు విన్నవించి తనకుఁ బొసఁగిన దోసఁగు దలంగం బ్రార్థింప, నాతండును దక్షకునాజ్ఞ మరలిం పంగరాదు. అయినను నీవింతగా వేఁడితివి గావున "నీ యంశమున నొక్క మానవుఁడు హరిశ్చంద్రుం డను మాన వేంద్రునకు నందనుండై, తక్షకునిచే దష్టుండై, తల్లిదండ్రుల పుణ్యంబునఁ బునర్జీవితుం డగు. దాన నిన్నాశాపంబున

నగు భయంబు దొడరనేరదు. నీవు వగవకుము, లేలెమ్ము, పొ''మ్మని యనుగ్రహించె. దానంజేసి యీ లోహితాస్యుం డు నలకూబరాంశంబున మహిం బుట్టి సర్పదష్టుండై గిట్టి బ్రదికెను.

## వీరబాహుని పూర్వజన్మ వృత్తాంతము.

అంతట సుయజ్ఞుండు, దండధరుండు చండాలుండై జనింపనేల యని యడుగ, వసిష్ఠుం డిట్లనియె. ఈ హరిశ్చం ద్రుని తండ్రి త్రిశంకుఁడు మదాశ్రమభూమికివచ్చి సాఁగిలి మ్రొక్కి లేచి గ్రక్కున మెయితోడ స్వర్గమునకుం జనునటు లనుగ్రహింపవేయని ప్రార్థించె. నేనందుల కియ్యకొననికతన విశ్వామిత్రుని వేఁడి బొందితో స్వర్గమునకుం బోవ శమనుఁ డు స్వర్గంబునుండి తలక్రిందుగఁ ద్రోయఁ గౌశికమునీంద్రుం డు దండధరునిఁ జండాలుఁ డగునట్లు శపియించె, అంతట నతండు పాదంబులపైఁ బడ ననుగ్రహించి ప్రియంబుఁ గావించె. కావుననే యంతకుఁ డంత్యజుఁడై వీరసేనునకు సుతుఁ డై వీరబాహు నామంబున వెలసియుండె.

## కాలకౌశికుని పూర్వజన్మ వృత్తాంతము.

అంత సుయజ్ఞుండు, శనైశ్చరుండు కాలకౌశికుండుగా నేల? యని యడుగ వసిష్ఠుం డిట్లని చెప్పం దొడంగె. తొల్లి త్వష్టప్రజాపతి తనపుత్త్రి సంజ్ఞయనుదానిం దరణికిం బరిణ యంబు సేసె. ఇనుండును దానియందు దండధరుం గాంచె. కొంతకాలంబున కప్పొలతియు నాతని మేనికాఁకలకు సైఁప లేక పుట్టినిల్లు చూడఁగోరి మగనికిఁ జెప్పకయ తనచాయనే

జాయగా నిర్మించి తండ్రియింటికిఁ బోవ నాతం డాత్మజం జూచి యట్లుసేయుట నీతికాదని "తురగివి క"మ్మని శపియించె. ఆనాతియు నాచఁగలేని దుఃఖంబుతోఁ దండ్రి కాళ్లపై నొఱగి, "పుట్టినిల్లనివచ్చిన నన్నీపగిది శపియింపం జను నే? ఇఁక నాకు దిక్కేవ" రనియేడ్చె. అంతఁ దండ్రి పుత్త్రిని లేవనెత్తి "నాశాపంబు తప్పదు. నీవు గోడిగవై కురుక్షేత్రవనాంతరంబుల వసియింతువేని నీమగం డగుమిత్త్రుఁడు ఘోటకంబై నినుం జేరు. నీకును శాపంబు తీరు" ననియె.

అట రవియుః జాయయందు శని యనునాత్మజుం గాంచె. చాయయుఁ దన తనయుఁ డగు శనైశ్చరుం జూచునట్లు యమునియెడఁ బ్రేమం జూడకుండె. యముండు నత్తెఱంగు నెఱింగి యొక్కనాఁడు చాయ తనతనుజుని శనైశ్చరుని నిజాంకమం దిడికొని తన్ను నిరాకరింప శనైశ్చరునిఁ గాలు విఱుగఁబడఁ దన్నె. ఇనుఁ డదిగాంచి "చాయ యమునితల్లియే యగునేని వాని నిర్దయం జూడదు. యముఁడును నిజానుజు కాలుపోవిఱువఁ" డని శంకించి, చాయ తన భామినిగాక యితరగా నిశ్చయించి, చాయవలన సంజ్ఞపోక దెలిసి తురగియై యిలం గురుక్షేత్ర వనాంతరంబున నుండు టెఱిఁగి, యచ్చటికి దురంగరూపమునం జని దానియం దశ్వినులను గవబిడ్డలం గాంచె. సంజ్ఞయు నిజనందనున కహితంబు చేసిన చాయవలని యీసున దాని సుతుఁ డగు శనైశ్చరుం బట్టి నైమిశారణ్యంబునకు నెట్ట, మును నంతకుచే విఱిఁగిన కాలును దునిఁగిపడియె. అచ్చట గాధితనయుఁడు వానిం భానుని సూనునిగా నెఱిఁగి, వానిం బెనఁచి సర్వ

కళాదక్షుంగాఁ జేసెను. శనియు నిరాహారుండై ఘోరతపం బాచరించి గ్రహములలో మేటిగ్రహమై నక్షత్రమండ లోన్నత పదంబున నుండు రాసులలో నొక్కొక్కరాశియందు ముప్పది మాసంబులు వసియించుచుండు. కావున నీశనియే కాలకౌశికుండై యవతరించికౌశికునకుం బ్రియంబుఁ గావించె.

ఇట్లని వసిష్ఠుం డెఱిఁగింప సుయజ్ఞుండును దనమనం బునం గలసంశయంబు లెల్లఁదీర్చుకొని సెలవుఁగొని తనగురుం గొలువఁ జనియె. వసిష్ఠుండును హరిశ్చంద్రుని వీడ్కొని నిజాశ్రమంబునకు నరిగె. సుయజ్ఞుండును గౌశికు నాశ్రమంబు నకుం జన నత్తపసి జపతపంబులు మాని కడు జాడ్యతతోఁ గన్నులు మూసి యొక్కపాదపంబునకు నొఱఁగి వంతచేఁ గడుంజింతఁ జేయుచుండె, సుయజ్ఞుండు నాతనికి సాఁగిలి మ్రొక్కి లేచి "మునీంద్రా! విపుల మహత్వ తత్వ సు వివేక నిధానుఁడ వయ్యు నిప్పుడీ వనటఁ జెంది యుండఁ గతం బెద్ది? నే వినఁ గూడు నేని యనుమానింపక సెలవిండు. తపం బు వృథా వ్యయంబాయెననియో? హరిశ్చంద్రనృపతి యెన్ని మాయలు పన్ని చపలతఁజేసియు సత్యము తప్పకుండె నని యో? అట్టియపరిమితార్తి నాత్మనొందఁ బనేమి?" యని తనమదికిఁ దోఁచినట్లెల్ల నడిగె. అందులకు సంయమి కను తెప్ప లల్లనవిచ్చి "ననుంజెనకిన ఖేదం బిప్పుడు నీవు సెప్పిన దెద్దియునుగాదు. నాతపం బెంత వ్యయమైనను, నృపుఁడు బొంకకున్న నదియొక తక్కువగాదు. వసిష్ఠుని పంత మే చెల్లె, నాకును నెల్లిదం బాయెననుచు నేనిటుఁ గుందు చుంటి" నని చెప్ప విని సుయజ్ఞుండు "గురూత్తమా!

బ్రాహ్మణుల కధికక్రౌర్య ముండదు. బ్రహ్మనిభుఁడగు నా బ్రహ్మర్షిశ్రేష్ఠుం డెన్నఁడును నిన్నే పొగడుచుండు. వా గీంద్రుని సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసి వస్తుసమృద్ధిని నీవొసఁగిన కతనఁగాదె యీహరిశ్చంద్ర భూధవుం డీధరాతలం బెల్లనేలు ను. మీమహిమంగాదె వానికీ వైభవంబు గలిగె'' నని ప్రతివలికె, అందుల కమ్మునియుఁ గరం బలరి తెలివినొంది ప్రశాంతుండై తపంబున కరిగె.

ఇట్లని మార్కండేయుండు హరిశ్చంద్రుని వృత్తాంతం బంతయు సవిస్తరంబుగ నాన తియ్యఁ బాండవాగ్రజుఁడును ''నవ్వల నయ్యిలాపతి యెయ్యనువునఁబ్రజాపాలనంబు సేయు చుండె'' ననియడుగమార్కండేయుఁ డిట్లనియె ''మహామహి మాన్వితుండగు నాహరిశ్చంద్ర సార్వభౌముండు సరసజ్ఞుం డగు సత్యకీర్తి సాచివ్యంబున సర్వసాగరావృత మేదినీ చక్రంబుఁ బాలించుచు సత్యకీర్తిం బ్రతిష్ఠాపించె. ధర్మము నాల్గుపాదములఁ బ్రవర్తిల్లుచుండె. ఇట్లాశ్రితజనాభీష్ట ప్రదా తయుఁ బ్రకృతిజనానంద సంధాతయు సకలబంధుజన సంత్రా తయునై చిరకాలంబు గర్భంబున విరాజిల్లు నర్భకునకుఁ దగినపగిది నాహారంబు లొసంగెడి గర్భిణివడువునఁ బ్రజల హితంబుఁ గైకొనుచు ధరాపాలనంబు సేయుతఱి జార చోర అనాచార దురాచార అపస్మార పరదూష పాషండ మిత్ర వంచక స్వామిద్రోహ లుబ్ధముందులు మందునకైనఁ గానరా కుండిరి. పతిభక్తి లేని సతులును, పితృభక్తులుగాని సుతు లును, గల్లరులును త్రిశంకునందనుఁ డేలెడిచోట నెందును గానరారైరి. ఎందుఁ జూచినను దేవతామహోత్సవంబు

లును, సమారాధనంబులు లోనుగాఁగల సత్కార్యంబులం బ్రవర్తిల్లని మానవులే గానరారు. ఇత్తెఱంగున నయ్యాది మచక్రవర్తి పుండరీకాక్షుండునుం బోలె సకల రక్షకుండై, సహస్రాక్షుండునుం బోలె నిఖిల లోకపాలకాధ్యక్షుండై, ధర్మపత్నియగు చంద్రమతితోఁగూడి పెక్కు లశ్వమేధంబులును విశ్వజిద్యాగ ముఖ్యసవనంబులును రాజసూయంబును జేసి యఖండ విభవంబున నిలయేలి దేహావసానంబుననింద్రు నర్థాసనంబుం బ్రాపించె. ఇప్పుడు నందు బృందారకసందోహంబు లభినందింప నానందించుచున్నవాఁడు. ధర్మజా! నీవు నాసార్వభౌమునట్ల రాజసూయాధ్వరం బొనర్చితివి. తెఱియగు డరిమర్దనం బొనర్చి యా హరిశ్చంద్రుని పగిది విఖ్యాతకీర్తి నొంది యిలనేలి సన్నుతిఁ గాంచెద''వని మార్కండేయుండు ధర్మజుచే నభ్యర్చితుఁడై వీడ్కొని యథేచ్ఛం జనియె.

''చ॥ కులసతిఁ బాసినన్ సుతుఁడు కూలిన నాపద లెన్నివచ్చిత
న్నలమిన మానభంగమయినన్ సిరిపోయిన రాజ్యమూడినన్
జెలులు త్యజించినన్ తుద కసింగొని ప్రాణము తీయవచ్చినం
బలుకఁగరాదుచూవె యణుమాత్రనుసత్యముమర్త్యుఁడెప్పుడున్.''

''క. సత్యమె దేవుఁడు జగమున
సత్యంబున్ బద్ధయెపుడు సంసేవించున్
సత్యైకమూలమెల్లను
సత్యముకంటెంబరంబు చనదుపదంబున్.''

స్వస్త్యస్తు.

## ERRATA

| పుట, | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 4 | 8 | గాథిను | గాధిసూను |
| 51 | 2 | వసిషు | వసిష్ఠు |
| 54 | 4 | ద్రోసివ | ద్రోసిపోవ |
| 55 | 1 | తొబ్లి | తొల్లి |
| ,, | 20 | యింతటి | యింతటం |
| 79 | 8 | మ్రెక్క | మ్రొక్క |
| 80 | 16 | వెచ్చసూర్చి | వెచ్చనూర్చి |
| 89 | 19 | కప్పునది | కప్పినది |

# Books by the Same Author

| | | Rs. | A. | P. |
|---|---|---|---|---|
| 1. | **Kusa & Lava** (Approved) Revised and Enlarged .... | 0 | 8 | 0 |
| 2. | **Vatsala** published by Messrs. Macmillan & Co. .... | 0 | 8 | 0 |
| 3. | **Harishchandra** Revised and Enlarged .... | 0 | 8 | 0 |
| 4. | **Apaninda Pariharam** (in the press) .... | 1 | 0 | 0 |

*Copies can be had of:—*

**N. C. Desikacharlu,**

**2, MUNIAPPAN STREET,**

**SOWCARPET :: :: G. T., MADRAS.**

Kesari Printing Works, Madras.